సామాజిక తత్త్వవేత్త

పోతులూరి వీరబ్రహ్మం

సాహిత్య, సాంస్కృతిక సమ్మేళనం

కర్నూలు

12.10.2019



# కాళికాంబ సప్తశతి

ఆచార్య పులికొండ సుబ్బాచారి





**ప్రచురణ సంఖ్య** : 1639

**ప్రథమ ముద్రణ** : అక్టోబరు, 2019

**ప్రతులు** :

వెల : ₹ 100/-

**ప్రతులకు**



**ప్రజాశక్తి బుక్‌హౌస్**

27-1-54, కారల్‌మార్క్స్ రోడ్, గవర్నర్‌పేట,

విజయవాడ -2, ఫోన్ : 0866 -2577533

**బ్రాంచీలు**

విజయనగరం, విశాఖపట్నం, కాకినాడ, ఏలూరు, విజయవాడ,

గుంటూరు, ఒంగోలు, నెల్లూరు, తిరుపతి, కర్నూలు, అనంతపురం

**ముద్రణ**

ప్రజాశక్తి డైలీ ప్రింటింగ్ ప్రెస్, విజయవాడ

website : www.psbh.in

prajasaktipublishinghouse@gmail.com

# ఆయన్ని ప్రజల్లోకి తీసికెళదాం

కులముకులమటంచు గొణిగెడి పెద్దలు
చూడరైరి తొల్లి జాడలెల్ల
మునుల పుట్టువులకు మూలమ్ము లేదండ్రు
కాళికాంబ! హంస! కాళికాంబ!

ప్రాచీన తెలుగు కవులలో వేమన విభిన్నమైన కవి. ఆయన కవిత్వమూ విభిన్నమైనది. పోతులూరి వీరబ్రహ్మం ప్రాచీన తెలుగు కవులలో విశిష్టమైన కవి. ఆయన కవిత్వమూ విశిష్టమైన ఈ యిద్దరినీ సామాజిక మార్పుకోరే వారంతా అధ్యయనం చేయాలి. వీళ్ళను సమాజంలోకి తీసుకుపోవాలి. నిజానికి యీ యిద్దరు ఇప్పటికి ప్రజలలో ఉన్నారు. వీరి పద్యాలూ, తత్వాలూ ప్రజల నాల్కల మీద నృత్యం చేస్తున్నాయి.

ఈ యిద్దరు కవులూ ఏ ఒక్క కులం సొత్తూ కాదు ఏ ఒక్క గుంపు సంపదా కాదు. వీళ్ళు విశ్వజనీన కవులు. తమ కాలానికన్నా ముందు నడచిన వాళ్ళు. వీళ్ళను కులాలకు, సమూహాలకు, స్థలాలకు, ఆశ్రమాలకూ పరిమితం చేయవలసిన అవసరం లేదు. ఈ యిద్దరూ తిరోగమనవాదులకు శత్రువులు. పురోగమ వాదులకు మిత్రులు. ఈ యిద్దరూ ప్రజా కవులు. ఈ యిద్దరి మీద ఎవరో ఆధిపత్యం వహించడం న్యాయం కాదు. ఈ యిద్దరి సాహిత్యాన్ని అందరమూ సొంతం చేసుకుందాం. అధ్యయనం చేద్దాం, వీళ్ళ బోధనలను ఆచరణలో పెడదాం. వీళ్ళను ప్రజలలో ఉన్న వాళ్ళను మళ్ళీ మళ్ళీ ప్రజలలోకి నడిపిద్దాం.

క్రీ.శ. 17వ శతాబ్దికి చెందిన కవిని క్రీ.శ. 21వ శతాబ్దంలో ఎందుకు

ప్రచారం చెయ్యాలి? అని ప్రశ్నించవచ్చు. ప్రశ్నించాలి ప్రశ్న ప్రగతికి మూలం. చంద్రోదయం అష్టాదశవర్ణనల్లో ఒకటిగా ఉండిన కాలానికి చెందిన కవిని, చంద్రుని మీద మనిషి కాలుమోపే కాలంలో ఎందుకు ప్రచారం చేయాలి? ఇది అందరమూ ఆలోచించవలసిన విషయం. మన సమాజం 17వ శతాబ్దంతో పోల్చిచూస్తే ఇప్పటికి చాలా అభివృద్ధి చెందింది. విద్యా వైజ్ఞానికాది రంగాలలో విప్లవాలు సాధించింది. అయినా వీరబ్రహ్మంగారు ఏయే రుగ్మతలను, తన కవిత్వంలో ఖండించారో అవి ఇంకా మన సమాజంలో కొనసాగుతూనే ఉన్నాయి. శాస్త్ర సాంకేతిక రంగాలలో అత్యంత ప్రాథమిక దశలో ఉన్నప్పుడు ఏయే విశ్వాసాలు, ఆచారాలు ఉండేవో, అవి శాస్త్ర సాంకేతిక విప్లవాల యుగంలో కూడా కొనసాగుతున్నాయి. వీటిని వీరబ్రహ్మంగారు ఆనాడే ఖండించారు. అవి ఈనాడు మనమూ – అంటే ప్రగతిశీల వాదులం, శాస్త్రీయవాదులం ఖండిస్తున్నాం. మనం ఖండించడానికన్నా ముందే, మన ముత్తాత ఖండించారు అని చూపించడానికి మనం వీరబ్రహ్మంగారిని ఇవాళ ప్రచారంలోకి తీసుకొని రావలసి ఉంది. ఇప్పుడు ప్రజాశక్తి చేస్తున్న పని అదే.

ఒక పూర్వకవిని ఇప్పుడెలా చూడాలి? అన్నది మరో ప్రశ్న. వాల్మీకి మొదలుకొని నేటి రచయితలదాకా విభిన్న కాలాల్లో, విభిన్న సందర్భాలలో రచయితలు రచనలు చేస్తూ, తమ కాలం నాటి పరిస్థితులను బట్టి కొన్ని అంశాలు చెబుతారు. కొన్ని బోధనలు చేస్తారు. అవి తర్వాతి కాలానికి యధాతథంగా అన్నీ వర్తించవు. కొంత కాలానికి కొన్నిటికి కాలం చెల్లిపోతుంది. కొన్నిటికి విలువ ఉంటుంది. వీరబ్రహ్మం గారి సాహిత్యంలో అయినా అంతే. అందువల్ల ఈనాటి సమాజం ముందుకు నడవడానికి, వీరబ్రహ్మంగారి సాహిత్యంలో ఏవేవి పనికొస్తాయో, ఆ పద్యాలనే ఆ తత్వాలనే స్వీకరించాలి.

కవులు మూడు రకాలుగా ఉంటారు. ఒక కవి రాసిన కావ్య వస్తువు అప్పటికే కాలం చెల్లినదిగా ఉంటుంది. అంటే ఆ కవి తన కాలానికే కాలం చెల్లిపోయి ఉంటాడు. ఇంకొక కవి రాసే కావ్యం. అతని కాలానికి విలువైనదిగా ఉండి, మరి కొంత కాలానికి కాలంచెల్లిందయి పోతుంది. మరోకవి రాసిన కావ్యం తన కాలానికి విలువైనదిగా ఉంటూనే, భవిష్యత్ కాలంతో కూడా సంబంధం కలిగిఉంటుంది. పోతులూరి వీరబ్రహ్మంగారి సాహిత్యం ఈ మూడోరకం సాహిత్యం. ఆయన సాహిత్యం 17వ శతాబ్దంలో ఎంత చలనశీలంగా ఉండిందో 21వ శతాబ్దంలో కూడా అంతే చలనశీలంగా ఉంది.

వీరబ్రహ్మంగారి రచనలలో 'కాళికాంబా సప్తశతి' ఈనాటి సమాజానికి, మిగతా రచనల కన్నా, అవసరమైన కావ్యం. కారణం వీరబ్రహ్మంగారి రచనలలో మిగతావాటి కన్నా 'కాళికాంబా సప్తశతి'ని సాంఘిక స్వభావం ఎక్కువ ఉండడమే. వీరబ్రహ్మంగారు తక్కిన రచనలలో చెప్పిందంతా ఒక ఎత్తు, 'కాళికాంబా సప్తశతి'లో చెప్పింది ఇంకో ఎత్తు. ఆధునిక సమాజానికి ఈ కావ్యమే మరింత సమీపంగా ఉంటుంది. అందుకే 'కాళికాంబా సప్తశతి'ని ఎందరు వ్యక్తులైనా, ఎన్ని సంస్థలైనా సమాజంలోకి తీసుకుపోయి ప్రచారం చేయాలి. పోటీపడి ప్రచారం చేయాలి. 'కాళికాంబా సప్తశతి'ని సమాజంలోకి తీసుకుపోయి ప్రచారం చేయడం బాధ్యత మాత్రమే, కర్తవ్యం మాత్రమే, సామాజిక అవసరం మాత్రమే. వ్యాపారం కాదు, కారాదు.

'కాళికాంబా సప్తశతి'లో వీరబ్రహ్మంగారు చేసిన పని ఒక్కమాటలో చెప్పాలంటే అంటే సాంఘిక ఆధ్యాత్మిక రంగాలలోని ఆధిపత్యాన్ని, ధ్వంసంచేయడం, దానిచుట్టూ అల్లిన మౌఢ్యాన్ని కడిగి పారేయడం. ఇదే బ్రహ్మంగారు చేసిన పని. భారతీయ సమాజాన్ని వేలయేళ్ళుగా పట్టిపీడిస్తున్న కులవివక్ష, మత మౌఢ్యం వీటిని వీరబ్రహ్మంగారు తీవ్రమైన విమర్శకు పెట్టారు. ఈ రెండు సమస్యలు ఈనాడు కూడా ఇంత ఆధునికత సాధించిన సమయంలో కూడా మన దేశాన్ని వదిలిపెట్ట కుండా వెంటాడుతున్నాయి. ఇందువల్ల వీరబ్రహ్మంగారు నేటి అవసరం. కందుకూరి, గురజాడ మొదలుకొని అనేకమంది రచయితలు విభిన్న చారిత్రక సందర్భాలలో అనేక ఉ ద్యమాల కాలంలో అనేక భావజాలాల వాళ్ళు ఈ రెండింటినీ ఖండిస్తూ వస్తున్నారు. అయితే వీళ్ళకు వేమన, వీరబ్రహ్మంలు పూర్వరంగం ఏర్పాటు చేసి ఉన్నారు. ఈ పూర్వరంగ నిర్మాణంలో 'కాళికాంబా సప్తశతి' పాత్ర చాలా కీలకమైనది. అందుకే ఈ కావ్యం నేటి అవసరం. ఈ కావ్యం ఇవాళ భారతీయ సమాజ పరివర్తనకు కరదీపిక.

వీరబ్రహ్మంగారు స్త్రీలను గౌరవించమన్నారు. కులాలన్నీ సమానమన్నారు. నేల అందరిదీ అన్నారు. సోమరితనం వద్దన్నారు. శ్రమను, శ్రామికులను గౌరవించమన్నారు. అభివృద్ధి అందరికీ చెందాలన్నారు. మోసం వద్దన్నారు, వంచన వద్దన్నారు. బాహ్యాడంబరం వద్దన్నారు. రాళ్ళకు మొక్కవద్దన్నారు. అన్నిటికీ దేహమే మూలమన్నారు. గురుశిష్యులు ఐక్యంగా ఉండాలన్నారు. అహంకారం మంచిది కాదన్నారు. స్త్రీ పురుషులిద్దరూ సమానమన్నారు. యవ్వనంలో తప్పుడు పనులు చేసి ముసలితనంలో వగచి లాభంలేదన్నారు. కర్మ – పనిని చేయమన్నారు. కర్మ సిద్ధాంతాన్ని వదల మన్నారు. ప్రతి వ్యక్తి తనను తాను తెలుసుకోవాలన్నారు. పేరు

ప్రతిష్ఠలకన్నా వ్యక్తిత్వం ముఖ్యమన్నారు. పరపీడన పరాయణత్వం వలదన్నారు. కులాన్ని చూసి మురిసి పోవద్దన్నారు. మనిషి పశువుగా మారకూడదన్నారు. సంపద ఒక చోట నిరుపయోగంగా కుప్పపడకూడదన్నారు. విరివిగా దానం చేయమన్నారు. అందరూ చదువుకోవాలన్నారు. చదువు వల్ల వినయం పెరగాలన్నారు. చెట్లకు పుట్టలకు మొక్క వద్దన్నారు. లగ్నాలు చూడడం దండగ అన్నారు. అస్పృశ్యత అమానుషమన్నారు. కులం తెగులు కొంపకూలుస్తుందన్నారు. ఎవరైనా దౌర్జన్యకరంగా మాట్లాడితే మౌనంతో సమాధానం చెప్పమన్నారు. మనుషులకు ఎఱుకు జ్ఞానం ముఖ్యమన్నారు. సాటి మనిషిని కాదని ప్రతిమలకు గుళ్ళు, గోపురాలు కట్టించవద్దన్నారు. ఆవులు ఎన్ని రంగులవైనా, వాటి పాల వర్ణం తెలుపేనని గుర్తించమన్నారు. ఏ సాంఘికాంశానికైనా మూలాలు చూడమన్నారు. అందరూ తల్లిగర్భం లోంచే పుట్టారన్నది గుర్తించమన్నారు. ఎవరూ శాశ్వతం కాదనీ, అందరూ ఎప్పుడో ఒకప్పుడు మరణిస్తారనీ తెలుసుకొని పరులను హింసించ వద్దన్నారు. పరుల మేలు కోసం పాటుపడమన్నారు. మనిషికి గుణం ముఖ్యమన్నారు. మంత్ర తంత్ర స్నానపానాలలో ఏమీ లేదన్నారు. అర్థవంతమైన చదువు చదవాలన్నారు. చదువులో నీతి, ప్రేమ ఉండాలన్నారు. అన్ని ప్రాణులు అన్నంతినే బతుకుతున్నామని, తిండి దగ్గర కులమెందుకని అన్నారు. మనుషులందర్నీ సమానంగా చూడమన్నారు. జాతి నైతికంగా పతనం కాకూడదన్నారు. అమ్మప్రేమ మాలిన్యం లేనిదన్నారు. అన్ని మతాలలోనూ కనిపించే మంచిని సమన్వయం చేసుకోమన్నారు. పరస్పరం సహకరించుకోమన్నారు. సహాయం చేసిన వాళ్ళను గుర్తుపెట్టుకోమన్నారు. సంఘాన్ని జాగ్రత్తగా అర్థం చేసుకోమన్నారు. తాత్కాలిక ప్రయోజనాల కోసం ఏదీ మాట్లాడవద్దన్నారు. మనిషికి తిండి ఒక అవసరమన్నారు. మనసును నిర్మలంగా పెట్టుకోమన్నారు. తీర్థాలన్నీ శరీరంలోనే ఉన్నాయన్నారు. మనిషి దోషరహితంగా ఉండాలన్నారు. విగ్రహారాధన వల్ల ధర్మమార్గం ధ్వంసమైందన్నారు. మనిషికి తృప్తి ఉండాలన్నారు. మానవులందరూ ఆనందంగా బతకాలని అందరు కోరుకోవాలన్నారు. అనుభవంలో లేని విషయాలను ఊహించి, కల్పించి చెప్పరాదన్నారు. విద్యా వ్యవస్థకు సరస్వతి అనే స్త్రీని దేవతగా పెట్టుకొని స్త్రీలకు విద్య లేకుండా చేయడం అన్యాయమన్నారు. గురువులలో కల్లగురువులున్నారు జాగ్రత్త అన్నారు. మతం హితం కూర్చేదిగా ఉండాలిగానీ, మత్తు పదార్థం కారాదన్నారు.

ఇంకేంకావాలి మనకు. ఇన్ని విషయాలు నేటి సమాజానికందించిన వీరబ్రహ్మంగారిని నమస్కరిద్దాం. ఈ కావ్యంలోని పద్యాలు అన్నీ అందరికీ అర్థం కాకపోవచ్చు. అన్నీ అందరికీ నచ్చకపోవచ్చు "మెచ్చుకుంటే మించి పాయెను" కాళికాంబా సప్తశతి ఒక నది. ఆ నదిలో ఎవరికి కావలసినన్ని నీళ్ళు వాళ్ళు

తీసుకోవచ్చు. సంస్కరణ భావాల పట్టుగొమ్మ కాళికాంబా సప్తశతి అది తెలుగు ప్రజల సామూహిక సంపద. దానిని గౌరవిద్దాం. దానిని చదువుదాం. ప్రజలలోకి తీసుకుపోదాం.

వీరబ్రహ్మంగారిది భక్తిజ్ఞాన మార్గం. భక్తి కొందరికి, జ్ఞానం కొందరికి ఇష్టపడవచ్చు. ఎవరికి కావలసినది వాళ్ళు స్వీకరించవచ్చు. ఆధునికులకు మాత్రం వీరబ్రహ్మంగారి జ్ఞానమార్గమే అనుసరణీయం.

**అజ్ఞానాన్ని తరిమేద్దాం**
**జ్ఞానాన్ని ఆదరిద్దాం.**

27-09-2019 రాచపాళెం

# కా ళి కాం బా స ప్త శ తి

1. అదితి సర్వసృష్టి కాధార మనె [1] ఋక్కు
సుదతి మూల మనె[2] యజుస్సుకూడ
ఇంతి మూల మనియె ఋగ్యజుస్సులు రెండు
కాళికాంబ! హంస! కాళికాంబ!

---

1. అదితి ర్ద్యౌ రదితి రంతరిక్ష
మదితి ర్మాతా సపితా సపుత్రః
విశ్వేదేవా అదితిః పంచజనా
అదితి ర్జాత మదితి ర్జనిత్వమ్

(ఋగ్వేదము. 1-89-10)

2. మహీం ఊషు మాతరం సువ్రతానాం
ఋతస్యపత్నీం అవసే హువేమ
తునిక్షత్రాం అజరంతీం ఉరూచీం
సుశర్మాణం అదితిం సుప్రణీతిమ్

(యజుర్వేదము 21-5)

2. ఉరకయున్న విశ్వ ముత్పత్తి యెట్లగు?
గురు నుపేక్ష గుర్తు దొరకు టెట్లు?
యుగయుగాల సాగు సుగతి యియ్యదియేను
కాళికాంబ! హంస! కాళికాంబ!

3. మనసుకోతి మొకరమునకు బంధింపగా
పెనగులాడి మాటవినును తుదకు;
మాట విన్న మోక్షమార్గమ్ము లభియించు
కాళికాంబ! హంస! కాళికాంబ!

4. ఓంకృతికి సమాన మొక్కటి గాబోదు
లింగ వచన మిందు లేనెలేదు
ప్రణవమందు నిలిచె పదునాల్గులోకాలు
కాళికాంబ! హంస! కాళికాంబ!

5. శక్తియుక్తుడైన శక్తిమంతుడగు
శక్తిలేనినా డశక్తుడగును
శంభుడంచు దెలిపె శంకరాచార్యుండు
కాళికాంబ! హంస! కాళికాంబ!

6. కాళిపూజ చేసి కవిత లల్లగనేర్చి
కవులలోన నగ్రగణ్యు డాయె
కాళిదాసుమించు కవులేరి జగతిలో?
కాళికాంబ! హంస! కాళికాంబ!

---

5. శివశ్శక్త్యా యుక్తో యది భవతి శక్తః ప్రభవితుం
నచేదేవం దేవో నఖలు కుశలః స్పందితు మపి
అతస్త్వా మారాధ్యం హరిహరవిరించ్యాదిభి రపి
ప్రణస్తుం స్తోతుంవా కథ మకృతపుణ్యః ప్రభవతి

(సౌందర్యలహరి-1)

7. కన్నులున్న ఫలము కాళికం జాచుట
చెవులుగల ఫలమ్ము చేరి వినుట
నోరుగల ఫలమ్ము నుతిచేసి తనియుట
కాళికాంబ! హంస! కాళికాంబ!

8. దుష్టవాయువితతి దోర్బలమ్మును జూప
దుర్బలులకు బ్రతుకు దుస్సహమ్ము
కలవరమ్ముమాపి కాపాడ జూడుమా
కాళికాంబ! హంస ! కాళికాంబ!

9. కర్మఫలము లొసగు కాత్యాయనివి నీవు
శర్మఫలము లొసగు శక్తి నీవు
ధర్మఫలము లొసగు దాక్షాయణివి నీవు
కాళికాంబ! హంస! కాళికాంబ!

10. శాంతి దాంతి కాంతి సర్వమ్ము నీవౌచు
భ్రాంతు లుడుపు నీవు పార్వతివిగ
మనసునందు నెంతు నిను పరాశక్తిగా
కాళికాంబ! హంస! కాళికాంబ!

11. బాహ్యమందు నిన్ను పరిపూర్ణముగా నెంతు
అంతరాన నిన్ను చింతసేతు
వెలియు లోన నీవె విశ్వమంతయు నీవె
కాళికాంబ! హంస! కాళికాంబ!

12. మానవులకు శాశ్వతానంద సంధాన
కర్త్రివైన నిన్ను కానలేక
క్షణిక సుఖముకోరి కష్టాల పాలైరి
కాళికాంబ! హంస! కాళికాంబ!

13. అతియు గతియు లేక అజ్ఞులై యంధులై
కాలగమన మంచు కర్మ మంచు
బ్రహ్మలిఖిత మంచు వాపోవుచుందురు
కాళికాంబ! హంస! కాళికాంబ!

14. పగలు వెంట రాత్రి పరుగెత్తుకొని వచ్చు
రాత్రి వెంట పగలు రానె వచ్చు
పగలు రాత్రి చేయు పరమేశ్వరివి నీవు
కాళికాంబ! హంస ! కాళికాంబ!

15. సర్వలక్షణములు సాధింపగా జూచు
దివిని భువిని గలుప దివురజూచు
తన్ను దాను దెలియ తలపెట్టడు జడుండు
కాళికాంబ! హంస! కాళికాంబ!

16. నిగ్రహమ్ము లేని నిర్భాగ్యు లెల్లరు
విగ్రహముల కెల్ల విందుచేసి
భోగభాగ్యములను బొంద కాంక్షింతురు
కాళికాంబ! హంస! కాళికాంబ!

17. సోమయాజి భార్య సోమిదేవమ్మైన
పాకయాజి భార్య పాకియగును:
సోమి, పాకి పాట్లు చూడ శక్యముగాదు
కాళికాంబ! హంస! కాళికాంబ!

18. పసిడిపలుకుల్లెల పాండిత్యమున వచ్చు
భాగ్యమెల్ల కష్టపడిన వచ్చు
కాని; మానవుండు కడతేఱ డద్దాన
కాళికాంబ! హంస! కాళికాంబ!

19. స్వీయ సౌఖ్యములకు వెంపరలాడుచు
క్రూరముగను పరుల కొల్లగొట్టి
మానవుండు ముందు మార్గమ్ము గానడు
కాళికాంబ! హంస! కాళికాంబ!

20. ముసలితనము కసిరి బుసగొట్టు సమయాన
తాను జేయు పనులు తలచి తలచి
కుమిలికుమిలి గోడుగుడువ లాభమ్మేమి?
కాళికాంబ! హంస! కాళికాంబ!

21. కులముకులమటంచు గొణిగెడు పెద్దలు
చూడరైరి తొల్లి జాడలెల్ల
మునులు పుట్టువులకు మూలమ్ము లేదంద్రు
కాళికాంబ! హంస! కాళికాంబ!

22. అలతియలతి పలుకు లలరించి వేమన్న
శతసహస్రపద్యవితతి చెప్పి
భోగి యోగియై విరాగియై రాణించె
కాళికాంబ! హంస! కాళికాంబ!

23. సద్గురూత్తముండు శాంభవీ శక్తిని
మాయ యంచు దెలిపె మంత్రమునను
మాయగల్గువాడు మాహేశ్వరుండనె
కాళికాంబ! హంస! కాళికాంబ!

---

23. దుర్జ్ఞేయా శాంభవీ మాయా
తయా సమ్మోహ్యతే జగత్
మాయాంతు ప్రకృతిం విద్ధి
మాయినంతు మహేశ్వరః

(శ్వేతాశ్వతరోపనిషత్)

24. తల్లి, దండ్రి, గురుడు, దైవమ్ములందున
తల్లిపూజ ముఖ్య మెల్లరకును:
సృష్టి కంతటికిని స్త్రీ ప్రధానముగదా
కాళికాంబ! హంస! కాళికాంబ!

25. అసురవరుల జంప హరిహరబ్రహ్మలు
చేతగాక నిన్ను జేరి కోర
దుర్గవగుచు వారి [1]దోరించితివి నీవు
కాళికాంబ! హంస! కాళికాంబ!

26. కోతిమూకతలను కుళ్ళాయి పెట్టుట
కుక్క మాడుమీద కుంభమిడుట
సహజగుణము మాన్ప సన్నద్ధ మగుటట్లె
కాళికాంబ! హంస! కాళికాంబ!

27. కంటిపొరలు తెరలు కడకొత్తబడునాడె
జ్ఞానమనెడి జోతి కానబడును
కంటిపొరలు మాయకప్పి మబ్బున వేయు
కాళికాంబ! హంస! కాళికాంబ!

28. శివుడు శక్తిగూడి సృష్టికార్య మొనర్చు
శివను వీడ సృష్టి చేయలేడు
శివునికంటె శివయె సృష్టికి మూలమ్ము
కాళికాంబ! హంస! కాళికాంబ!

29. నీకు సమయ మెపుడు నిలుచు నిశ్చలవార్త
మాకు సమయ మెపుడు మరలవార్త
సమయమునకు సమయ మమలిన గురుమూర్తి
కాళికాంబ! హంస! కాళికాంబ!

---

1. దోరించితిని = చంపితివి

30. అయినలెక్కనంత “ఆవర్జ” పెట్టగా
ఒందు తిరము చేసి రెండు పెట్టు
అయిదుతోడ భాగహారించిన నొకటౌను
కాళికాంబ! హంస! కాళికాంబ!

31. ఎద్దుమొద్దులందు నేమి భేదము లేదు
బుద్ధిగలుగు వాడె పూరుషుండు
మనుజపశువుకంటె మహిపశువే మేలు
కాళికాంబ! హంస! కాళికాంబ!

32. ఏడుకొండలెక్కి చూడబోయిన వాడు
కలతలంది బోడితలగ వచ్చు
ఏడుమెట్టు లెక్కి యీక్షింప మోక్షంబు
కాళికాంబ! హంస! కాళికాంబ!

33. జాతరలకుబోవ యాతన లెన్నియో
కష్టమెంతొ అంత నష్టమగును
ముక్కుసూటిపోవ ముక్కంటి కడుదాపు
కాళికాంబ! హంస! కాళికాంబ!

34. సర్వదేవతలకు సదనమ్ము దేహమ్ము
గుడులకేగి పాట్లు పడగనేల
నేనుమేనుసందు నిలుచును బ్రహ్మంబు
కాళికాంబ!హంస! కాళికాంబ!

---

30. ఇరువదొక్క తత్వాలు – ఒందు తిరముచేసి ఒకటిని ముందుగా ఉంచి ఈ ఒకటికి ముందు రెండు సంఖ్య నుంచగా 21 అగును. 5తో భాగించగా ఒకటి వచ్చును. పంచభూతాలతో భాగారించ ఒకటి చైతన్యము నిల్చును.

35. సారహీనమైన సంసారమున జిక్కి
ఆలుబిడ్డలన్న ఆశతోడ
భుక్తికొఱకు జాడ ముక్తి లభింపదు
కాళికాంబ! హంస! కాళికాంబ!

36. గురుని నిందచేసి పరము గాంచెదనన్న
హీనగుణుడు బుద్ధిలేనివాడు
బుద్ధిలేని సుద్దమొద్దు లజ్ఞానులు
కాళికాంబ! హంస! కాళికాంబ!

37. నీరు శంఖమందు నింప తీర్థమౌను
భావమందు గురుడు బ్రహ్మమౌను
బ్రహ్మమాయ దెలియ పరమాత్మ తానౌను
కాళికాంబ! హంస! కాళికాంబ!

38. కనగలేరు జనులు కరణాల వ్రాతను
ఫాలమందు ధాతవ్రాత రీతి
వ్రాత గన్నవాడు వైకుంఠవాసియౌ
కాళికాంబ! హంస! కాళికాంబ!

39. బావిలోని జలలు పైకి చిమ్మెడిరీతి
హెచ్చుగాను దాన మీయవలెను
ఇచ్చి నొచ్చుకొన్న హేయంబు నరకంబు
కాళికాంబ! హంస! కాళికాంబ!

40. మంచికాల మేగుదెంచిన రావచ్చు
తెల్లవాఱుదనుక తిరిగి రాకు
తిరిగి వత్తువేని దెబ్బలు తప్పవు
కాళికాంబ! హంస! కాళికాంబ!

41. పగలు రాత్రి బట్టబయలాయె హాయలాయె
ముక్తివలన రక్తి మునిగిపోయె
పగలు రాతిరన్న పదము పాడయిపోయె
కాళికాంబ! హంస! కాళికాంబ!

42. జనుడు కోరలున్న సర్పమ్ము కారాదు
తోడెలవుట మంచి త్రోవగాదు
నరుడె బ్రహ్మ మెఱుగ నారాయణుండౌను
కాళికాంబ! హంస! కాళికాంబ!

43. త్రవ్వ త్రవ్వ నుయ్యి గవ్వలు వచ్చెనా
కంటివింటితోడ కడకు గొట్టు
కంటి వింటి నంటి కలరు దేవతలెల్ల
కాళికాంబ! హంస!కాళికాంబ!

44. యముడు లెక్క యడుగు సమయమ్ము రాగానె
చిత్రగుప్తుకవిలె చినిగిపోయె
సత్తుచిత్తు నాయె చిత్తు సత్తుగ మాఱె
కాళికాంబ! హంస! కాళికాంబ!

45. చదువుకొన్నఫలము కుదురైన వినయమ్ము
వినయఫలము వేదవేది యగుట
వేదవేదిఫలము విశ్వమ్ము తానౌట
కాళికాంబ! హంస!కాళికాంబ!

---

42. మా హిర్భూ ర్మా పృదాకు ః (యజుర్వేదము 6-12)

ఓ మానవుడా! నీవు విషసర్పముగా కావలదు. మోసగించు తోడేలువు కావలదు. మననశీలుడైన మనుష్యుడవు కమ్ము.

46. చీకుచింత లుడిగి యేకాదశీవ్రత
మ్మాచరింప సౌఖ్యమందు నరుడు
వ్రతముకంటె మతికి ప్రాధాన్య మీవలె
కాళికాంబ! హంస!కాళికాంబ!

47. శక్తిగాలి సోకి సమసిరి పురుషులు
ముక్తిగాలి సోకి ముక్తులైరి.
రక్తి ముక్తి లేక భ్రష్టులైరి జనాలు
కాళికాంబ! హంస! కాళికాంబ!

48. చెట్టుపుట్టలకును చేయెత్తి మ్రొక్కుచు
వట్టిమాట లిట్లు వదరనేల
దిట్టమైనగురుడు దేదీప్యమైయుండ
కాళికాంబ! హంస!కాళికాంబ!

49. గురుడు ముక్కుతాడు గూర్చి వంచినవేళ
చిత్తశుద్ధి గలుగు శిష్యునకును
మనసు మకురుచేసి మాయలు పన్నును
కాళికాంబ! హంస!కాళికాంబ!

50. మనసు కెన్నడైన మర్యాద లేకుండ
మనసులోన నొదిగి మాయ యుండు
మాయలోన మనసు మాడిపోవుచునుండు
కాళికాంబ! హంస! కాళికాంబ!

51. సకల విద్యలకును సాక్షి కామాక్షియౌ
మోక్షమునకు సాక్షి ముక్తి కాంత
పుట్టుగిట్టుటలకు భూదేవతే సాక్షి
కాళికాంబ! హంస! కాళికాంబ!

---

49. మక్కళి అన్న తమిళపదానికి మకురు తెలుగు పదం = మూర్ఖుడు
మకురతనము = మూర్ఖత్వము, మొండితనము- ధర్మధర్మి వాచకాలు తారుమారగుట కనుపట్టును.

52. స్త్రీలలోన గలుగు శీలసంపదలతో
సత్యపథములోన జగము నడచు
స్త్రీలమనసులోనె శివు నివాసమ్మగు
కాళికాంబ! హంస!కాళికాంబ!

53. నీవె యాడుదాన వీవె పూరుషుడువు
యువకుడవును వీవె యువతి నీవె
ముసలివీవె సర్వమును నీవె శివరూప
కాళికాంబ! హంస! కాళికాంబ!

54. సత్యవార్త విన్న జన్మ సాఫల్యమ్ము
చెడ్డవార్త విన్న చెవులు చెడును
గురునివార్త విన్న పరమాత్మ చేరును
కాళికాంబ! హంస! కాళికాంబ!

55. ముక్తిలేని చదువు ముక్కలు చెక్కలు
రక్తిలేని భార్య ప్రాణహంత
ముక్తి రక్తి నీయ శక్తుండు బ్రహ్మమ్ము
కాళికాంబ! హంస! కాళికాంబ!

56. ముక్తిమాత్ర మిచ్చు మున్నూరువిద్యలు
బ్రహ్మవిద్య మోక్షపథము చూపు
ముక్తికాంత పిలుచు మోక్షపథస్థుని
కాళికాంబ! హంస! కాళికాంబ!

---

53. త్వం స్త్రీత్వం పుమా నసి త్వం
కుమార ఉత వా కుమారీ
త్వం జీర్ణో దండేన వంచసి
త్వం జాతో భవసి విశ్వతోముఖః

(శ్వేతాశ్వతరోపనిషత్)

57. మూటి మూటగట్ట ముమ్మూల బ్రహ్మమ్ము
కానవచ్చు దివ్యకాంతితోడ
కానవచ్చు తానె కైలాస మనుకొండ
కాళికాంబ! హంస! కాళికాంబ!

58. కన్నులందు గలదు కైలాసశైలమ్ము
దానిపైన శివుడు తాండవించు
శివుని ప్రక్కనున్న చిన్నమ్మవే నీవు
కాళికాంబ! హంస! కాళికాంబ!

59. వేదవిద్యలెల్ల బాధాకరమ్ములు
ఎంగిలింత మ్రింగ హేమమాయె
హేమమైన బ్రహ్మ వేమన్న ఒక్కడే
కాళికాంబ! హంస! కాళికాంబ!

60. అన్నిదెసల బ్రహ్మ మావరించుటవల్ల
ప్రకృతికెల్ల మ్రొక్కు పాడియగును
ప్రకృతి రూపముగను బ్రహ్మమ్ము గనుపట్టు
కాళికాంబ! హంస! కాళికాంబ!

61. కనులుమూసి ధ్యానమున నుండవలెనన్న
మాయ మనసు రెచ్చి మరులు గొలుపు
మనసు కట్టువాడె ఘనమైన మునియౌను
కాళికాంబ! హంస! కాళికాంబ!

62. బూది నొసట బూయ వాదోపవాదాలు
శాస్త్రవాసనలును సమసిపోవు
బూదిలోనగుట్టు పూర్ణగురు డెఱుంగు
కాళికాంబ! హంస!కాళికాంబ!

63. ఒకడు బ్రహ్మ మన్న నొకడు కేశవు డను
ఒకడు శివుడటంచు తికమకపడు
దొరలు లోకములకు హరిహరబ్రహ్మలు
కాళికాంబ! హంస! కాళికాంబ!

64. మాయ సర్వజనుల మరులు గొల్పుచు నుండు
మాయలేనినాడు మతము లేదు.
మాయతోడ బుట్టె మంత్రతంత్రములెల్ల
కాళికాంబ! హంస! కాళికాంబ!

65. బుజముపైనిముద్ర బుద్ధిపై పడబోదు
బుద్ధి మార్చువాడె పూర్ణగురుడు
గురునిదీక్ష స్వర్గనరకాల దాటించు
కాళికాంబ! హంస! కాళికాంబ!

66. ఒక్క పొద్దు లుండి ఉపవసించినవారి
కుక్షిలోని వెతలు గురులు గనిరి
అంతరింపజేసి రాకలిదప్పులు
కాళికాంబ! హంస! కాళికాంబ!

67. కాయమనెడి గూట కాపున్న పులుగును
గట్టివాడుగూడ పట్టలేడు
గురు డొకండె పట్టుకొన శక్తియుక్తుండు
కాళికాంబ! హంస! కాళికాంబ!

68. గురుని మంత్రమనెడి గొడ్డలి చేబూని
గుబురుకొన్న పొదల కూలగొట్టి
లోన వెలుగుశివుని లోగొన్న మునియౌను
కాళికాంబ! హంస! కాళికాంబ!

69. తీంద్రమైన కవిత గంద్రగొడ్డలిగాగ
బాట నడ్డు శత్రుకోటి గొట్టి
వరకవీశు డచలబ్రహ్మమ్ము తానౌను
కాళికాంబ! హంస! కాళికాంబ!

70. ఐదు తెలియకున్న అన్వయమే లేదు
మూడు గొట్టువాడు ముల్లె పట్టు
పదియు బిగియబట్ట బ్రహ్మపదమ్మందు
కాళికాంబ! హంస! కాళికాంబ!

71. ఆశలున్నవారి కదియేది అంటదు
ఆశలుడుగ గలుగు ఆత్మశుద్ధి
ఆత్మశుద్ధి గలుగ నందును పరమాత్మ
కాళికాంబ! హంస! కాళికాంబ!

72. దురిత మాచరింప పరమేశ్వరునకైన
పాసిపోదు కర్మఫలము సుంత
కాశి కేగ ఫలము కాసంత గలుగదు
కాళికాంబ! హంస! కాళికాంబ!

73. ధ్యాన, యోగ, వేద, యజ్ఞాదులకు నీవు
కానుపింపబోవు: మానసమును
చక్కజేసికొన్న సాక్షాత్కరింతువు
కాళికాంబ! హంస! కాళికాంబ!

---

73. న వేదాధ్యయనై ర్యోగై
ర్న ధ్యానై స్తపసేజ్యయా
రూపం ద్రష్టు మిదం శక్యం
కేవలం మత్కృపాం వినా.( దేవగీత)

74. అంకు మంకుచేయ రాతిరి పగలాయె
శంకలన్ని తుదకు జారిపోయె
కొంకినక్కపాలు కొంటెదేహం బాయె
కాళికాంబ! హంస! కాళికాంబ!

75. మాట కేమిఫలము? మనసు నిల్ప ఫలమ్ము
మనసు నిల్ప తేటమాట దొరకు
తేటమాటదొరక దేవతామూర్తియౌ
కాళికాంబ! హంస! కాళికాంబ!

76. కులమనేటి తెగులు కొంపలు గూల్చును
చలమనేటి తెగులు చావుదెచ్చు
కులము, చలము చంపు గురుడైన విప్రుండు
కాళికాంబ! హంస! కాళికాంబ!

77. మూర్తి రూపురేఖ భ్రూమధ్యమున నిల్ప
దివ్యమైన వెలుగు తేజరిల్లు
మూర్తి లేని రాయి ముఖ్యమ్ము గాబోదు
కాళికాంబ! హంస! కాళికాంబ!

78. తలను తడిమి గురుడు తగు మంత్రముం జెప్పు
ఆత్మలోని ముఱికి నంత గడుగు
జనన మరణ దుఃఖ సముదాయముం ద్రుంచు
కాళికాంబ! హంస! కాళికాంబ!

79. వికృత వేషములను వేయు టక్కరియోగి
ప్రకృతిలోన మెలగు బ్రహ్మయోగి
ప్రకృతివికృతులకును పరుడౌను శివయోగి
కాళికాంబ! హంస! కాళికాంబ!

---

76. అనేటి – వ్యావహారికము

80. చీకుచింత లుడుపు నేకాక్షర బ్రహ్మ
మూల మెఱుగ నిహపరాలు గలుగు
సూత్ర మెఱుగకున్న సుజ్ఞాని కాబోడు
కాళికాంబ! హంస! కాళికాంబ!

81. నోరుతెఱచి కూయు నోములోము నటంచు
కల్లబొల్లికతలు నల్లిచెప్పు
నోరు తెఱవ వేదసారమ్ము రావలె
కాళికాంబ! హంస! కాళికాంబ!

82. సతులు సుతులుగూడ సంసార మాయెను
చింతలెల్ల వీడ సిద్ధుడాయె
దురితములను వదల పురుషోత్తముం డాయె
కాళికాంబ! హంస! కాళికాంబ!

83. పనులు చేయువేళ ఫలము మనమ్ములో
వెదకకున్న వాడు వేమయోగి
ఫలము వెదకువాడు బ్రహ్మమ్ము గనలేడు
కాళికాంబ! హంస! కాళికాంబ!

84. చిక్కువిప్పి కటికచీకటి పోగొట్టి
టక్కు పిక్కు తెలిపి నిక్కమైన
వెలుగు చూపు యోగి వేమన్న మాయన్న
కాళికాంబ! హంస! కాళికాంబ!

85. సూర్యచంద్రు లొక్క చూపులో నున్నారు
పగలు రాత్రి జనుల వదలబోరు
అంతరాత్మ సాక్షులై యుందు రిరువురు
కాళికాంబ! హంస! కాళికాంబ!

86. సత్పదార్థమందు చంద్రుండు వసియించు
చిత్పదార్థమందు శివుడు చిక్కు
సత్తుచిత్తు లెఱుగు సాధకుడౌ యోగి
కాళికాంబ! హంస! కాళికాంబ!

87. తన్ను డా దెలిపిన తండ్రికి తనయుండు
ఘడియవిఘడియలకు గానరాడు
తండ్రి తనయు లనుట తంటాలకే గదా!
కాళికాంబ! హంస! కాళికాంబ!

88. ఎఱుకగలుగువారి కేపాటి మఱపున్న
కాలమెల్ల వృథగ గడచిపోవు
ఎఱుకకెల్ల మఱుపు పరమశత్రువుగదా!
కాళికాంబ! హంస! కాళికాంబ!

89. కనులమీద గురుడు కాపురం బుండును
పంచభూతములకు పైన నుండు
మాయతనువులోని మాలిన్యమును డుల్చు
కాళికాంబ! హంస! కాళికాంబ!

90. దొంగపనుల మేము వంగియుండగ లేము
కొంగవాలుకత్తి కొట్టగలము
భంగపడక గురునిపజ్జ నుందుము సదా
కాళికాంబ! హంస! కాళికాంబ!

91. నాద, బిందుకళల నయముగ గుర్తించి
వాదభేదములను వంచి గురుడు
సమయజేయు దేహ సందేహదాహమ్ము
కాళికాంబ! హంస! కాళికాంబ!

92. అన్నితనువులందు ఆత్మ యొక్కటియని
చర్చచేసి పలుపు రర్చకులుగ
వారివారి యిచ్చవచ్చినట్లుందురు
కాళికాంబ! హంస! కాళికాంబ!

93. అఖిలభూతములకు నాత్మ యొక్కటి యని
గుర్తెఱింగి మెలగు గుణికి నెందు
మోహశోకములు సమూలమ్ముగా దెగు
కాళికాంబ! హంస! కాళికాంబ!

94. అంతరంగముల మహాదేవు నర్చించి
చూడగలుగువారె సూరివరులు
ప్రకృతిమాయ దొలగ పశుపతులవుదురు
కాళికాంబ! హంస! కాళికాంబ!

95. బ్రహ్మహత్యనైన పరిహరించును యోగి
బ్రహ్మకర్మ జుట్టు పట్టుకొనును
గట్టిశిష్యుడైన గ్రహియించు నీబోధ
కాళికాంబ! హంస! కాళికాంబ!

96. పాపరహితమైన బ్రహ్మోపదేశాన
కర్మమనెడి దూది కాల్చివేసి
బూది సద్గురుండు బుంగల కెత్తును
కాళికాంబ! హంస! కాళికాంబ!

---

92. యస్తు సర్వాణీ భూతాని ఆత్మన్యేవానుపశ్యతి
సర్వభూతేషు చాత్మానం తతోన విజుగుప్సతే. 6

93. యస్మి న్సర్వాణి భూతాని ఆత్మైవాభూత్ విజానతః
తత్ర కోమోహః కశ్శోకః ఏకత్వ మనుపశ్యతః 7
వివరణ: ఈ రెండు మంత్రములు యజుర్వేదము నలువదవ మండలమైన ఈశావాస్యోపనిషత్తులోనివి.

97. విశ్వమంత మాయ వేడుకలును మాయ
నేను, మేను మాయ నీవు మాయ
మాయలోన బుట్టి మలయు సమస్తంబు
కాళికాంబ! హంస! కాళికాంబ!

98. మనసు పొరలనీక మాయల బడబోక
చిలిపిరాళ్ల పూజ చేయబోక
గురుని పూజచేయ పరమలాభమ్మగు
కాళికాంబ! హంస! కాళికాంబ!

99. కులము మతము వాదములు తర్కమున బోవు
గురుకటాక్ష మున్న నెఱుక పోవు
నీ పదార్చనమున ప్రాపించు మోక్షమ్ము
కాళికాంబ! హంస! కాళికాంబ!

100. చిన్న బుచ్చరాదు శివకేశవుల సదా
కనుల గన్నవారి గారవించి
అంద ఱొకటియంచు నర్చించ మేలగు
కాళికాంబ! హంస! కాళికాంబ!

101. కులము గోత్రమంచు కూసెడి మలపల
కర్మఫలము ముందు కట్టికుడుపు
బ్రహ్మ మందగలరు వర్ణాదులను వీడ
కాళికాంబ! హంస! కాళికాంబ!

---

101. వర్ణాశ్రమాచారయుతా విమూఢాః
కర్మానుసారేణ ఫలం లభంతే
వర్ణాది ధర్మంహి పరిత్యజంత:
స్వానందతృప్తాః పురుషా భవంతి.

(మైత్రేయోపనిషత్1-13)

102. ప్రకృతి జూచి యోగి పారవశ్యం బంది
రక్తియుక్తుడైన భక్తి చెడును
భక్తిచెడిన వెనక భగవంతు గనలేడు
కాళికాంబ! హంస! కాళికాంబ!

103. దృష్టిమధ్యమందు దేవుడెప్పుడు నుండు
కష్టమేమిలేక కాంచవచ్చు
తుష్టిగూర్చి గురుడు త్రోవలు చూపించు
కాళికాంబ!హంస! కాళికాంబ!

104. విద్య విశ్వమందు వివరింపకుండెనా
గురుని గురుత కుప్పగూలిపోవు
బుద్ధిగలుగు గురుడె పూర్ణస్వరూపుడౌ
కాళికాంబ! హంస! కాళికాంబ!

105. గురుని మరులులేని నరులు నాశనమైరి
మరులు గలుగు నరులు మరలరారు
మరల తిరిగిరాని మార్గమ్ము గనవలె
కాళికాంబ! హంస!కాళికాంబ!

106. మనసు బిగియబట్టి మును దశేంద్రియముల
ఎగుడుదిగుడు పోవనీక గట్ట
అగరుగంధమట్టు లాత్మలో గురు డుండు
కాళికాంబ! హంస! కాళికాంబ!

107. గురుని సేవ శిష్యపరమాణు వొనరుప
చెలగి గురునియంత శిష్యు డగును
గురుడు శిష్యుడన్న గురుతు శూన్యమౌను
కాళికాంబ!హంస! కాళికాంబ!

108. కండ[1] కుండలించి కుండలి నాడించి
జమిలిమోత నాగసరము నూద
నాగుబాము లేచి నాట్యమ్ము చేయును
కాళికాంబ!హంస! కాళికాంబ!

109. పాముపెట్టె నున్న పరిమళంబే లేదు
తెఱచిచూడ పెట్టె పరిమళించు
పరిమళించు టనగ పడగెత్తుటే గదా!
కాళికాంబ! హంస! కాళికాంబ!

110. ఇచ్చమెచ్చు కుండలీంద్రుని మేలికి
సోహమనెడి గాలి సోకెనేని
కస్సుబస్సుమంచు గల్లంతుగా లేచు
కాళికాంబ! హంస! కాళికాంబ!

111. శరణుగోరి గురుని వరమంత్రమును విన్న
పరుల శరణు గోర పనియె లేదు
హరిహరులకు మిన్న గురు పరబ్రహ్మమ్ము
కాళికాంబ! హంస! కాళికాంబ!

112. తన్ను దా గ్రహింప తారకయోగమౌ
రాయి కొయ్య గొలువ రాదు ముక్తి
పూజచేసి వెతల బొందుట మేలొకో
కాళికాంబ! హంస! కాళికాంబ!

113. వన్నె లైదు గల్గు ప్రతిమలకై గుళ్ళు
గోపురాలు కూడు గుడ్డలిచ్చి
ప్రాణమున్నవారి పట్టించుకో రేమి?
కాళికాంబ! హంస! కాళికాంబ!

---

1. కుండలించి = సున్నచుట్టి

114. భక్తుడనుచు ప్రజల ప్రస్తుతి నందగా
గుండురాయి దెచ్చి గుడిని నిలుప
సుప్రతిష్ఠ రాక అప్రతిష్ఠయ వచ్చు
కాళికాంబ! హంస! కాళికాంబ!

115. ఎఱుక దొలగకున్న ముఱికిజాడ్యము పోదు
గురుని దెలియకున్న గుణము చెడదు
బయలు గానకున్న బ్రహ్మమ్ము కనరాదు
కాళికాంబ! హంస! కాళికాంబ!

116. ఇలకు దిగెడువేళ కుల మెవ్వరికి లేదు
మొదలు శూద్రుడుగను పుట్టువందు
శ్రుతులు చదువువెనుక శూద్రుండె విప్రుడౌ
కాళికాంబ! హంస! కాళికాంబ!

117. ఆత్మలోని యెఱుక అంతరించిన నాడు
బయలు బ్రహ్మపదము పట్టునాడు
శౌచమెంతొ కలుగ నాచార్యు డతడౌను
కాళికాంబ! హంస! కాళికాంబ!

118. మూడు "హుకుము" లైతె మూర్ధాభిషిక్తుండు
ఏడు మెట్టు లెక్కువాడు గురుడు
[1]ఈడబోక నిలుచువాడె సచ్ఛిష్యుండు
కాళికాంబ!హంస! కాళికాంబ!

119. చిత్తు మనసులోన జీర్ణించు రీతిగా
శిక్ష పడక యోగి శివుడు గాడు
చిత్తులోన గలుగు చిన్మయానందంబు
కాళికాంబ! హంస! కాళికాంబ!

1. ఈడబోక = పాఱిపోక

120. ప్రజల మెప్పు కొఱకు పదివేల పదములు
పాడువాడు ముక్తిపథము గనడు
పడయవచ్చు ముక్తి పరమాత్ము పాడిన
కాళికాంబ! హంస! కాళికాంబ!

121. స్వాములంచు నెంచి సంభ్రమింపగా నేల
సకల జనులు యోని సంభవులెగ
మానవత నెఱుంగు జ్ఞానె బ్రహ్మజ్ఞాని
కాళికాంబ! హంస! కాళికాంబ!

122. పాదములకు శరణు భక్తులు చేయగా
పరమశివుడు మెచ్చు భావమందు
శివుని మెప్పు స్వర్గసీమకు రహదారి
కాళికాంబ! హంస! కాళికాంబ!

123. తిరములేని దేహ మురవడించినయట్లు
దేహి నడచుకొన్న తిప్పు లగును
తప్పుచేసి శివుని తలపోయ ఫలమేమి?
కాళికాంబ! హంస! కాళికాంబ!

124. నన్ను నేను గాంచ పట్టు దొరకు
పరమశివుని గాంచ పట్టుదొరకు
నన్ను నేను గానకున్న సర్వము సున్న
కాళికాంబ! హంస! కాళికాంబ!

125. ఎఱిగినట్టివార లెక్కడ నున్నారు?
ఎఱుకశక్తి గెలువ నెవరితరము?
వేమనార్యు డొకడె వేదాంతవేద్యుండు
కాళికాంబ! హంస! కాళికాంబ!

126. వలను విసరి ముత్యములు పట్టురీతిగా
పరమపురుషు జనుడు పట్టవలెను
పట్టలేని తెలివి వ్యర్థ మనర్థమౌ
కాళికాంబ! హంస! కాళికాంబ!

127. గురుని మనసునందు గుఱిపెట్టి తలపెట్ట
తప్పులన్ని తొలగి ధన్యుడగును
ధన్యుడైన లోకమాన్యుడై తరియించు
కాళికాంబ! హంస! కాళికాంబ!

128. గురువులనుచు ప్రజకు బరువుగా నుందురు
గుట్టు దెలియనట్టి గురువులెల్ల
గుట్టుమట్టు దెలియు గురువులే హరిహరుల్
కాళికాంబ! హంస! కాళికాంబ!

129. చావు నీడవోలె జీవిని వెన్నాడ
పరుల బాధపెట్టువాడు పశువు
పశువు మేలుగాదె పరులకు తోడ్పడు?
కాళికాంబ! హంస! కాళికాంబ!

130. పరులకొఱకు పాటుపడువాడు ధన్యుండు
పరముకొఱకు పాటుపడును యోగి
యోగికంటె ధన్యు డుత్తమోత్తము డౌను
కాళికాంబ! హంస! కాళికాంబ!

131. ఆలుమగల కూర్మలను వీణపై రెండు
తంత్రు లదికి మీటి దైవమొకడు
శ్రుతికి మేళవింప సొంపుగా విననింపు
కాళికాంబ!హంస! కాళికాంబ!

132. తెలిసి తెలియనీయ దిల మాయ నరులకు
మాయ తెలియబోవ మబ్బుపట్టు
మబ్బు వీడినంత నబ్బును బ్రహ్మంబు
కాళికాంబ!హంస!కాళికాంబ!

133. చావుపుటుక లేని జ్ఞానాగ్ని దగ్ధమౌ
దేహమునకు శ్రాద్ధదినము లేదు
కాలినట్టిబూది కాల్తురా యెవరైన?
కాళికాంబ! హంస! కాళికాంబ!

134. మాటలాడినట్లు మనసు నిల్పినవాని
కరుణతోడజూచు పరమగురుడు
గురునిబోధకంటె గుణము ముఖ్యముగదా!
కాళికాంబ! హంస! కాళికాంబ!

135. మొదట దుర్గుణంబు మోహ మావలలోన
తగుల త్రిప్పలేదు దైవమైన
గురు డొకండె విప్పు పరమార్థమును జెప్పి
కాళికాంబ!హంస! కాళికాంబ!

136. మాకు మీకు గురుడు మాధవుడే కదా!
నిడివి అడ్డబొట్టు నిందయేమి?
మతము కల్పితమ్ము మార్గమొక్కటెగదా!
కాళికాంబ! హంస! కాళికాంబ!

---

133. దగ్ధస్య దహనం నాస్తి
పక్వస్య పచనం యథా
జ్ఞానాగ్నిదగ్ధదేహస్య
నచశ్రాద్ధం నచక్రియా.
(యజుర్వేదీయ పైంగలోపనిషత్ 4వ అధ్యాయము)

137. తనువులోని వాడు తానాడి నట్లుండు
కాని పోని లేని క్రమము దప్పి
గురుని దీక్షగొన్న కుదురును రోగమ్ము
కాళికాంబ! హంస! కాళికాంబ!

138. గురుని కరుణతోడ కుండలి పైకెత్తి
పండుగింత చేయ బ్రహ్మ మగును
బ్రహ్మమైన వెనుక పరమాత్మ తానౌను
కాళికాంబ! హంస! కాళికాంబ!

139. స్నానమందు లేదు పానమందును లేదు
మంత్రతంత్రములను మహిమ లేదు
గుణము కుదిరెనేని ఘనయోగి తానౌను
కాళికాంబ! హంస! కాళికాంబ!

140. చల్లనీళ్ళ మునుగ చలి నులివెట్టగా
మెల్లమెల్ల గొణుగు లొల్లెగాంద్ర
ఉల్లమందు నెంచ రుచితజ్ఞులగువారు
కాళికాంబ! హంస! కాళికాంబ!

141. క్రమము దప్పువేళ కష్టజీవులపైని
కరుణచూపలేని కష్టతముడు
బట్టబయలులోని బ్రహ్మమ్ము గనలేడు
కాళికాంబ! హంస! కాళికాంబ!

142. చదువగలరు లోని సార మ్మెఋంగరు
చదువులఫల మదేమి? సారమేమి?
సారమైనచదువు సాధించ తరియించు
కాళికాంబ! హంస! కాళికాంబ!

143. ప్రేమలేని చదువు ప్రేతభూషణ మాయె
నీతిలేని చదువు రోతమాయె
ప్రేమ నీతి గల్గు విద్యయే పరవిద్య
కాళికాంబ! హంస! కాళికాంబ!

144. శివుడు పెట్టు తిక్క చెఋప నెవ్వరికౌను
నరునిరూపునున్న గురుడు తప్ప
హరుబలమ్ముకంటె గురుబల మ్మధికమ్ము
కాళికాంబ!హంస!కాళికాంబ!

145. చదివిచదివి ముదిమిగదిసి మూర్ఖత రేగ
చదువు మర్మ మెఋగు జాడ గనరు
నేర్పులేని చదువు నిష్ప్రయోజన మౌను
కాళికాంబ! హంస! కాళికాంబ!

146. శిక్షలేనిమనసు చిక్కు నైదుగురిచే
శిక్ష గలుగు మనసు శివుని గనును
శివుని గని మనసు శిక్షించుకొను తానె
కాళికాంబ! హంస! కాళికాంబ!

147. తప్పుపట్టుటన్న తగినట్టులున్నది
తనువు దిగిననాడె తప్పుపుట్టె
తనువుతోడ తలపు తప్పుల తడకాయె
కాళికాంబ! హంస! కాళికాంబ!

148. ముల్లుగుట్టు తావు మొదట గన్పింపదు
మెల్లమెల్ల వెదకి మీటవలయు
కల్లలట్లే దిగును కాయమ్ములోపల
కాళికాంబ! హంస! కాళికాంబ!

149. వద్దనున్న గురునివైపు గానగలేక
వెఱ్ఱి మొద్దులవలె వెదకులాడి
బుద్ధిమాలి నరులు పోయిరి పోకగా
కాళికాంబ! హంస! కాళికాంబ!

150. వెదకివెదకివెదకి వేసారి వేసారి
అచట నిచట లేడటంచు నెంచి
తఱచి చూసి తాను తనలోన గనుగొనె
కాళికాంబ! హంస! కాళికాంబ!

151. సంతలోన జచ్చు చావు నేమందుము?
వింతదొంగ యనుట విశదమాయె
ఎంతదొంగగాక సంతలో జచ్చునా!
కాళికాంబ! హంస! కాళికాంబ!

152. సంతలోన కుక్క చచ్చినచావాయె
ముంతపోట్లు ముక్కు పోట్లతోడ
సంతచావు తప్పు సద్గురు దరిచేర
కాళికాంబ! హంస! కాళికాంబ!

153. మఱవకుండ వేయ మనసుకు ముకుత్రాడు
గురుని మీద గుఱియు కుదురుకొనును
గుఱియు కుదిరెనేని గురుమూర్తి తానవును
కాళికాంబ! హంస! కాళికాంబ!

154. కుదురుకొన్న ఫలము మొదట గన్పింపదు
కుదుటబడిన మనసు కొదువపడదు
మనసు కుదుటబడిన మాధవుడేయౌను
కాళికాంబ! హంస! కాళికాంబ!

155. బంధమోక్షములను సంధించును మనస్సు
స్వేచ్ఛనిచ్చి దాని విడువరాదు
విడువకున్న నాత్మ విశ్వేశ్వరుని జేరు
కాళికాంబ! హంస! కాళికాంబ!

156. ఎఱుకలోన తిరుగ నిహలోక సుఖమబ్బు
బయలులోన తిరుగ బ్రహ్మమబ్బు
ఎఱుకబయలు తెఱవు లెఱిగించు గురుమూర్తి
కాళికాంబ! హంస! కాళికాంబ!

157. ముక్కు మొగము చెక్కి మూర్తి పూజలు చేయ
తొలుత చేయు దొసగు తొలగబోదు
మనసునిలుప జనన మరణాలు దొలగును
కాళికాంబ! హంస! కాళికాంబ!

158. జ్ఞానసుధను ద్రావగాను సద్గురుజేర
దీక్ష నొసగి యమృతభిక్ష పెట్టు
అమృత మారగింప నజరామరం డౌను
కాళికాంబ! హంస! కాళికాంబ!

159. కుక్క తానె మొఱుగు కుసిలించి కుసిలించి
గురువు వచ్చినప్పుడు కఱవ వచ్చు
కఱవవచ్చినప్పుడు గురు డూరకుండును
కాళికాంబ! హంస! కాళికాంబ!

160. మనసుమాయ దెలిసి మహనీయకవులైరి
మనసు లేకయున్న మాయలేదు
మాయ మనసులాయె మాయి మహామాయి
కాళికాంబ! హంస! కాళికాంబ!

161. పరమపురుషు నాత్మభావన భావించి
ఆత్మపురుషు వెలుగు నరయు నట్టి
ఆమె బ్రహ్మపదము నందు పతివ్రత
కాళికాంబ! హంస! కాళికాంబ!

162. శిఖరమందునున్న శివుని గాంచిననాడు
సన్నుతించగలరు సకలసురలు
శివుడు తానెయైన చెప్ప నేమున్నది?
కాళికాంబ! హంస! కాళికాంబ!

163. చిహ్న మేమి యనగ చిక్కులు పెక్కులు
చిహ్న మేమి యనగ చిచ్చు పెచ్చు
చిహ్న మడుగ మతము సివమెత్తి ఘోషించు
కాళికాంబ! హంస! కాళికాంబ!

164. విశ్వ మైదుతోడ వివరించియున్నది
నింగి గాలి నిప్పు నీరు నేల
అన్నిచోట్ల తానె ఆటాడుచున్నది
కాళికాంబ! హంస! కాళికాంబ!

165. బుద్ధికొలది మాట పుట్టును నరులకు
హద్దులేదు కనుక బుద్ధిలేదు
బుద్ధిలేకపోవ పుట్టిచచ్చుట లాయె
కాళికాంబ! హంస! కాళికాంబ!

166. యతులు ప్రాస లేరికగు నేర్పుగ గూర్ప
గురుడు లేద కాళి కూర్చవలెను.
గురుని కాళిదయను వరకవు లవుదురు
కాళికాంబ!హంస!కాళికాంబ!

167. తనకుమించి దైవతము డెవ్వడును లేడు
మునులకంటె ఘనుడు  మొదలె లేడు
తనకు, మునులకెల్ల తల్లి దేవతగదా!
కాళికాంబ!హంస!కాళికాంబ!

168. అదిగొ మఱతునన్న అజ్ఞాన గుణ మాయె
బాగ మఱతునన తమోగుణమ్ము
మఱచి మఱవనన్న మదమొ పిచ్చియొ యౌను
కాళికాంబ! హంస! కాళికాంబ!

169. నడత వృథగ నడచెనా!యేమె చెప్పుమా
కష్టములకు నదియె కారణమ్ము
నడతవెంట శివుడు నడిపించు మనుజుల
కాళికాంబ! హంస! కాళికాంబ!

170. నిజముమీద భూమి నిలబడి యుండును
సత్యవాక్కు వలన జనత నడచు
సత్యమొకటే పాపసంహారముం జేయు
కాళికాంబ! హంస! కాళికాంబ!

171. సత్యమార్గమునను సమకూరు పదవులు
నిత్యనూతనముగ నిలిచియుండు
సత్యమైన దొక్క సద్గురుపదవియౌ
కాళికాంబ! హంస! కాళికాంబ!

172. సత్యమంచు సభల చాటించి రధికులు
మిత్రశత్రువులను మిడిసి పడిరి
నిత్యసత్యమార్గనిర్ణాయకులు లేరు
కాళికాంబ! హంస! కాళికాంబ!

---

170. సత్యనోత్తంభితా భూమిః (అధర్వణము 14-1-1.)
ఋతస్యాధీతిః వృజినా నిహంతి (అధర్వణము. 4-23-3).

173. ఇంద్రియముల బుట్టు నీరేడు లోకాలు
ఇంద్రియముల వృద్ధి చెంది సమయ
ఇంద్రియములలోన నీశ్వరు డున్నాడు
కాళికాంబ! హంస! కాళికాంబ!

174. గురుడు శిష్యుడున్న గుఱు తెఱుంగగవలె
గురుడు జ్యోతి శిష్యవరుడు ద్రష్ట
సద్గురుండు నిలుచు సవ్యాపసవ్యాల
కాళికాంబ! హంస! కాళికాంబ!

175. కూటివలన నేరుపాటయ్యె ప్రాణులు
కూడులేక వేఱుకులము లేదు
కూటిమర్మ మెఱుగు గురుమూర్తి యొక్కడే
కాళికాంబ! హంస! కాళికాంబ!

176. అన్నితిట్లు తిట్టి అజ్ఞాని దనుజుడౌ
తిట్లుమాని జ్ఞాని దేవు డగును
అరయ నిదియె జ్ఞాని యజ్ఞానులకు తేడ
కాళికాంబ! హంస! కాళికాంబ!

177. దొరకినపుడె శివుడు తొలగి పోకుండగా
పిఱికిలేక మనసు బిగియబట్టి
ఉరవడించి చూచి పరవశించును యోగి
కాళికాంబ! హంస! కాళికాంబ!

178. పరవశివు డనంగ మఱి యెక్కడో లేడు
పరవశివు డనంగ బట్టబయలె
బట్టబయలులోన పరమాత్మ నిండుండు
కాళికాంబ! హంస! కాళికాంబ!

179. ఎవరు గనిరి పూర్వ మెక్కువ తక్కువ
తక్కువెక్కువలకు తానె కర్త
ఎక్కువనుట పాపహేతు వధర్మమ్ము
కాళికాంబ! హంస! కాళికాంబ!

180. మానసమ్ము ద్రచ్చసాన వజ్రమ్మగు
మానసమ్ములోన మహిమ గలదు
మహిమ గాంచు వాడు మాధవుండైయుండు
కాళికాంబ! హంస! కాళికాంబ!

181. చెప్పు నెత్తిమీద చేర్చి చెండినగాని
చెప్పినట్లు మనసు చేయబోదు
చెప్పినట్లు వింటె చెడ్డ చేరగబోదు
కాళికాంబ! హంస! కాళికాంబ!

182. ఆకృతింత లేక ఆద్యంతములు లేక
మేలుగీళ్ళతోడి జోలి లేక
సర్వరూపములుగ జగదంబ వెలుగొందు
కాళికాంబ! హంస! కాళికాంబ!

183. దార బంది– కన్నతనయుళ్ళు సంకెళ్ళు
బంధువర్గమెల్ల ప్రహరిగోడ
చిక్కి స్రుక్కి నరుడు నక్కలపాలౌను
కాళికాంబ! హంస! కాళికాంబ!

184. హృదయమందు వాణి పదిలమ్ముగా నుండ
ముష్టిపండు రుచ్యముగను మాఱు
వాణిలేక పనసపండు చేదైతీరు
కాళికాంబ! హంస! కాళికాంబ!

185. ఊరుగాయ లైదు కూరిచి ఉప్పుతో
నేర్పుతో మసాల నించి వండి
సకలవాసనలను సమకూర్చు నిల్లాలు
కాళికాంబ! హంస! కాళికాంబ!

186. ఇల్లు నిక్కమైన ఇల్లాలు నిక్కమౌ
ఇల్లు గలుగ పిల్లి పిల్ల లుండు
ఇల్లు కల్లజేయు నెల్లమాయల మాయు
కాళికాంబ! హంస! కాళికాంబ!

187. అయిదునైదు నిరువదైదు తత్వంబుల
తరచి చూడ నవియు మరణమొందు
మరణమైన పిదప మరల బుట్టుచు నుండు
కాళికాంబ! హంస! కాళికాంబ!

188. వెండి పైడి గద్దెవేసి మూర్తము చేసి
ఉండి యేలుమనుట యుపమ చేయ
మొండికుక్క మొఱిగి మూర్తమ్ము చెడద్రొబ్బె
కాళికాంబ!హంస!కాళికాంబ!

189. చచ్చి యెవరినైన సాధింపగా లేము
[1]చాక బాధకముల సాధకముల
సమయజేసి పరము సాధించుకొనరయా!
కాళికాంబ! హంస! కాళికాంబ!

190. చూపు మనసు లొక్క సూత్రాన బంధించి
వెన్నుపూస నిక్క వేయునాడు
కొంప ముంచు వాంఛ గనుగు బేరము దీయు
కాళికాంబ! హంస! కాళికాంబ!

---

1. చాక=చావక

191. నాలుగింటిలోన నాణ్యమ్ము గనలేక
మూలనున్న పదవి ముట్టలేరు
తాను నేను వేఱు నానుడి తర్కమౌ
కాళికాంబ! హంస! కాళికాంబ!

192. గురుడు శిష్యుడొక్క గురుతు చేరిననాడు
పరపదమ్ము చేరిబ్రతుకగలరు
తమకు దారిచూపు తారక యోగమ్ము
కాళికాంబ! హంస! కాళికాంబ!

193. దృష్టి నిలిపెనేని దేవుడు దిగివచ్చు
దృష్టి నిలుపడేని నష్టపడును
దృష్టిలోన సర్వసృష్టి పుష్టమ్మౌను
కాళికాంబ! హంస! కాళికాంబ!

194. బట్టబయ లనంగ పరమాత్మ యనగను
వేఱటంచు దలచు వెఱ్ఱివాడు
బయలులోన బయలు పరికింప పరమాత్మ
కాళికాంబ! హంస! కాళికాంబ!

195. మనసు మాట బుద్ధిమార్గాలు వేఱైన
పలవజాతివాడు పరము గనడు
మూటి నొకటి చేసి మోక్షమ్ము గనవలె
కాళికాంబ! హంస! కాళికాంబ!

196. మనసు నిలిపి గురుని మంత్రఫలమ్మును
శుచిగ రుచిగ తినును శుద్ధయోగి
ఫలము వేఱులేదు పరమపద మ్మది
కాళికాంబ! హంస! కాళికాంబ!

197. దివ్య మంగళమ్ము దేవతాబింబమ్ము
ఉల్లమందు నున్న ఉపము గనకు
యాత్రలెల్ల దిరిగి యాతన పడనేల?
కాళికాంబ! హంస! కాళికాంబ!

198. సత్యమొకటి తనకు సాకారమై నిల్వ
మృత్యు వదరి బెదరి మ్రింగబోదు
సత్యవంతు యముడు చంపగా జాలెనా!
కాళికాంబ! హంస! కాళికాంబ!

199. మూడు యుగములందు ముదితలు ముగ్ధలు
పురుష దౌష్ట్యమునకు పొగిలినారు
కలియుగాన కాంత లిల నేలగలరయా!
కాళికాంబ! హంస! కాళికాంబ!

200. ఆగమానుమాన – ధ్యానాది విధులచే
ప్రజ్ఞ ముప్విధాల పదిలపఱిచి
పొందగలడు యోగమును మునిముఖ్యుండు
కాళికాంబ! హంస! కాళికాంబ!

201. ప్రభువుపదము పట్టి బంటు సాధించెనా
ప్రభువుకంటె బలుడు బంటువాడు
గురునిపదము పట్టి మఱిమించి శిష్యుండు
కాళికాంబ! హంస! కాళికాంబ!

---

200. ఆగమేనానుమానేన ధ్యానాభ్యాస రసేనచ
త్రిధా ప్రకల్పయన్ ప్రజ్ఞాం లభతేయోగ ముత్తమమ్. (వ్యాసరచిత యోగభాష్యము)

202. మాయబడిన జనులు మర్మంబు గనలేరు
మాయ దొలగిపోవ హాయిగలుగు
మాయ ద్రుంచ గురుని మంత్రమ్ము శక్తమ్ము
కాళికాంబ! హంస! కాళికాంబ!

203. యౌవనమ్ము రాగ నజ్ఞాన మనుతెర
కన్నులకును పొరగ గప్పితీరు
తెరలు పొరలు తెగిన పరనారి తల్లియౌ
కాళికాంబ! హంస! కాళికాంబ!

204. తనువు లస్థిరమని ధనము తా గాదని
ధర్మశీలు డగుచు తగినపాటి
దాన మిచ్చువాడె ధన్యాత్ము డిలలోన
కాళికాంబ! హంస! కాళికాంబ!

205. మాననీయు డాదిమధ్యాంత రహితుండు
చావు పుట్టువులకు జాగ నిడదు
తుచ్ఛు డెపుడు పుట్టి చచ్చును నుందును
కాళికాంబ! హంస! కాళికాంబ!

206. గురుడు గురుని గూర్చి కుండలి పైకెత్తు
పర్వ మెఱిగెనేని బ్రహ్మమగును
పర్వమెఱుగకున్న పలవ పాడగుసుమా!
కాళికాంబ! హంస! కాళికాంబ!

207. దేహమనెడి ఇల్లు దీప్యమౌ పొరకతో
ఊడ్చి శుభ్రపఱుప నొప్పుచుండు
శాంతమనెడి [1]పొరక సాధించు ఘనయోగి
కాళికాంబ! హంస! కాళికాంబ!

---

1. పొరక = చీపురు (కడప మాండలికము)

208. నీవె చూడ విశ్వనిర్మాణకర్తవు
బహుకుటింబి నీవె బ్రహ్మ మీవె
తథ్యమనుచు దెలియ తహతహ లుండవు
కాళికాంబ! హంస! కాళికాంబ!

209. 'తత్త్వైవ' యనుచు తఱచి చూచినగాక
హరు డదేల చిక్కు తిరముగాను?
బయలు బ్రహ్మమన్న బ్రహ్మమ్ము గాబోడు
కాళికాంబ! హంస! కాళికాంబ!

210. వేటుమీద వేటు వేయగా రసముర్లి
ఫలమునుండి పడును; పట్టిదాని
గుప్తముగను ద్రావ గురుమూర్తి యతడౌను
కాళికాంబ! హంస! కాళికాంబ!

211. కన్నుఱెప్పమూయు కాలమ్ములోపల
[1]పంపువచ్చు నెలవు పట్టవలెను
ఱెప్పలోన పంపు ఱివ్వుఱివ్వన వచ్చు
కాళికాంబ! హంస! కాళికాంబ!

212. మాల మాదిగలకు మూలమ్ము హరియౌను
మాల మాదిగలకు శూలి మొదలు
హరియు హరుడు రెండు తెఱగులై వచ్చిరి
కాళికాంబ! హంస! కాళికాంబ!

213. జన్మకాలమందు సర్వులు శూద్రులు
మంత్రతంత్రములను మాఱె కులము
శుద్ధిమంతుడాయె శూద్రుండు గురుదీక్ష
కాళికాంబ! హంస! కాళికాంబ!

---

1. పంపు = మారణకర్మము, లేదా ఆజ్ఞ

214. సోమయాజి బట్టి శునకంబు గఱచెనా
తిరిగి కఱవకున్న ధీరుడౌను
తిరిగి కఱచెనేని మఱి కామయాజియౌ
కాళికాంబ! హంస! కాళికాంబ!

215. ఆత్మలోని ధనము నంత కన్నము వేసి
దొంగిలించువాడు దొడ్డయోగి
యోగులందు రాజయోగి కన్నపుదొంగ
కాళికాంబ! హంస! కాళికాంబ!

216. చిత్తు గుఱ్ఱమెక్కి సత్తను [1]తఱటుతో
ఉరిమి తరిమికొట్ట పరుగుతీయు
పరుగుతీయునంత బ్రహ్మమ్ము తానౌను
కాళికాంబ! హంస! కాళికాంబ!

217. రక్షణకును కర్త శిక్షణకును కర్త
ఆర్తిబాపు మోక్ష కర్త అదియె
ముక్తి రక్తి నిచ్చు శక్తి ఓంకారమే
కాళికాంబ! హంస! కాళికాంబ!

218. ఆత్మతత్వ మిట్టిదని గుర్తెఱుంగక
కూటికొఱకు వ్రాయు కుకవులకును
బ్రహ్మతత్వ మెఱుకపడ నశక్యమ్మౌను
కాళికాంబ! హంస! కాళికాంబ!

219. ఆటపాటలయందు బాటమాటలయందు
హద్దుమీఱి తిరుగ బుద్ధిగాదు
దారి తప్పెనేని దైవమ్ము కృపదప్పు
కాళికాంబ! హంస! కాళికాంబ!

---

1. తఱటు= కమ్చీ, కొరడా

220. గురుని గుఱిగ దలచ గుహ్యకర్మము చెడు
తీర్థయాత్ర సులప నర్థము చెడు
మనసు నిల్ప జనన మరణ బంధము చెడు
కాళికాంబ! హంస! కాళికాంబ!

221. మాతృపూజ చేయు మగవారి కెల్లను
అన్యకాంత తల్లియట్ల తోచు
ఎఱుక మఱచువాడు నరకమ్ము పాలౌను
కాళికాంబ!హంస!కాళికాంబ!

222. మనసు కలతబెట్టగను దశేంద్రియములు
ముంచివైచి తీరు మోహవార్ధి
మనసు బిగియబట్టి మార్గమ్ము గనవలె
కాళికాంబ! హంస! కాళికాంబ!

223. చందమామకళల చందంబు గనువాడు
భ్రాంతిమయ శరీరభంగు లెల్ల
తెలిసి విడిచి నిండువెలుగు తా గావలె
కాళికాంబ! హంస! కాళికాంబ!

224. ముక్కు నొక్కిపట్ట మోక్షమ్ము రాబోదు
వెన్నునిక్కిపట్ట వెతలు పోవు
కర్మశతములెల్ల కాలు సుజ్ఞానాన
కాళికాంబ! హంస! కాళికాంబ!

225. పంచభూతముల ప్రపంచమ్ము జనియించు
వానివలనె కొట్టబడును తుదకు
అరయ బ్రహ్మ మిరువదైదుతత్వమ్ములు
కాళికాంబ! హంస! కాళికాంబ!

226. ఎఱుకమఱపులందు పెరిగిన దేహమ్ము
ఆలుబిడ్డ లనుచు నలమటించి
ఇహము పరము చెడగ గృశియించి నశియించు
కాళికాంబ! హంస! కాళికాంబ!

227. విత్తు విత్తునాడె వెట్టిమోహముతోడ
పొత్తు గలియగలిగె సత్తుచిత్తు
సత్తుచిత్తు గూడి జగమాయె జనమాయె
కాళికాంబ! హంస! కాళికాంబ!

228. ఎన్నిగడియలైన నెవ్వారు చొరకుండ
లోన గడియవేయ కానుపించి
శివుని చూచువాడు చిన్మయబ్రహ్మమౌ
కాళికాంబ! హంస! కాళికాంబ!

229. చొచ్చి హృదయమందు సుజ్ఞానధనమును
అపహరించిపోవు నాసపోతు
దొంగపడ్డయిల్లు భంగమై పోవదా!
కాళికాంబ! హంస! కాళికాంబ!

230. శ్రీగిరీంద్రమునకు సివమెత్తి పరువెత్త
మల్లికార్జునుండు మాయ మగును
భక్తి గలుగునాడు భగవంతుడగపడు
కాళికాంబ! హంస! కాళికాంబ!

231. లోనుచూపు లేక లోతు సాధించక
ఆలయమున శివుని నంటకాగి
లోనిశివుని జూడ బూనడు జడబుద్ధి
కాళికాంబ! హంస! కాళికాంబ!

232. పచ్చిగడ్డి మొదలు బ్రహ్మపర్యంతమ్ము
పశువులనుచు పిలువబడియె మున్ను
పశువులకును పతిగ పరమేశ్వరుం డొప్పె
కాళికాంబ! హంస! కాళికాంబ!

233. బయలు చూచినట్లు, భావనలోబడు
కానరాదు బయలు కన్నులకును
చూపు రూపుమాపు చోటు పూర్ణమ్మగు
కాళికాంబ! హంస! కాళికాంబ!

234. బయల బట్టబయల హోయల చూడంగను
చర్మచక్షువులకు సాధ్యమగునె
గురునిదయకు నోచుకొన్న వారికి గాక
కాళికాంబ! హంస! కాళికాంబ!

235. సూత్రమెఱిగి వెలుగు చూడగా చూడగా
పాపజాల మెల్ల రూపుమాయు
పూర్వజన్మకర్మ బూడిదయై పోవు
కాళికాంబ! హంస! కాళికాంబ!

236. నోము నోచి కాచి నుదుటి వ్రాతను మాన్ప
శక్తియుక్తు డెవడు జగతిలోన?
నోమునోచినంత నోమడు దేవుడు
కాళికాంబ! హంస! కాళికాంబ!

237. పదుగురకును మెచ్చువాటిల్లునట్లుగా
జపము తపము వ్రతము సలుపవచ్చు
వానిలోని శివుని కానంగ శక్యమా!
కాళికాంబ! హంస! కాళికాంబ!

---

232. బ్రహ్మాద్యాస్తంబ పర్యంతాం పశవఃపరికీర్తితాః
తేషాంహి నాయకో యస్మాచ్ఛివః పశుపతి స్స్మృతః

238. గర్భగుడిని శివుడు కానంగ వచ్చును
గర్భమందు శివుడు కానరాడు
గర్భశివుని జూడగా నేర్చు సిద్ధుండు
కాళికాంబ! హంస! కాళికాంబ!

239. అంతరంగ మనెడి అంగడిలో దొంగ
చెంగలించి శివుని దొంగిలించు
దొంగ దొరకు గురుని సాంగత్య మున్నచో
కాళికాంబ! హంస! కాళికాంబ!

240. మంచిచెడ్డలందు మరియాద విడకుండ
నడచువాడె జగతి నాణెకాడు
పొంగి కుంగుచుండు పోకిరి సన్నాసి
కాళికాంబ!హంస!కాళికాంబ!

241. విశ్వగురుడు హరుడు విశ్వేశు డాహరి
విశ్వసృష్టికర్త వేదముఖుడు
ముగురు నీదుగర్భమున దాగి యుందురు
కాళికాంబ! హంస! కాళికాంబ!

242. ముల్లు విఱిగినేని ముప్పుతిప్పలు పెట్టు
కల్లు తాగెనేని కలతపెట్టు
ముల్లు కల్లులోని మూలమ్ము గనమేలు
కాళికాంబ! హంస! కాళికాంబ!

243. [1]గోడగించి పలుక కొంటెయై పోవును
ఉలుకు పలుకు లేకయున్న మూగ
మాట చేటులకును మౌని దా సాక్షియౌ
కాళికాంబ! హంస! కాళికాంబ!

1. గోడగించి = తిరస్కరించి

244. తన్ను దాను జూచు ధన్యుడౌ మాన్యుండు
వెలిగ జూచువాడు వెఱ్ఱివాడు
చేవ గలుగువాడు లోవెలి చూచును
కాళికాంబ! హంస! కాళికాంబ!

245. నాకు గానరాడు నాలోని శివుడంచు
బెంగపడగ నేల అంగిలందు
గలశివుండు నాల్కమెలివెట్ట గాన్పించు
కాళికాంబ! హంస! కాళికాంబ!

246. గురుతు చూతమన్న పరము శూన్యంబాయె
గురుని చూతమన్న గుణము పోయె
దొరతనమ్ము లేక దొరకునా మోక్షమ్ము
కాళికాంబ! హంస! కాళికాంబ!

247. రేవుగట్టువారు భావజ్ఞు లగుదురు
త్రోవగట్టువారు దొరలగుదురు
రేవు త్రోవ గట్టలేనివారలు జడుల్
కాళికాంబ! హంస! కాళికాంబ!

248. నలుగు రాఱుగురును నాయకుల్ పదిమంది
పదనొకండు వాడు ప్రభువు జగతి
ప్రభువు శాసనమున పైవారు నడతురు
కాళికాంబ! హంస! కాళికాంబ!

249. ఆత్మగుడిని దీస ఆమహాదేవున
కారగించ బెట్టు నతడు యోగి
గడియదీయలేరు కపటపు యోగులు
కాళికాంబ! హంస! కాళికాంబ!

250. సాంత్వనమ్ము మాని సాలోక్య సామీప్య
శబ్దములను బోధ సలుపునంత
శమము దమము గల్గి సారూప్య మెట్లగు
కాళికాంబ! హంస! కాళికాంబ!

251. చిత్తశుద్ధి తోడ [1]శృంగాటకము చేర
పరమపదము పథము నరయవచ్చు
పరముగన్నవాడు పరమాత్మయై తీరు
కాళికాంబ! హంస! కాళికాంబ!

252. కంఠమాది మీదికమలమ్ము వఱకును
శాంభవంబునకును స్థానమాయె
ఆఱుచక్రములకు ఆధార మీవెకా
కాళికాంబ! హంస! కాళికాంబ!

253. వెదకి వెదకి తుదకు వేదాంత తత్వమ్ము
విలువ నెఱిగి పలుకగల డెవండు?
వేదవాది వణకు వేదాంతులను జూచి
కాళికాంబ! హంస! కాళికాంబ!

254. సత్తు చిత్తటంచు నుత్తుత్త దృష్టితో
నుర్విలోన జూడ నుత్తదౌను
దృష్టి నిష్ఠ నిలువ దిగివచ్చు దేవుండు
కాళికాంబ! హంస! కాళికాంబ!

---

1. శృంగాటకము= భ్రూమధ్యము

252. మూలాధారదిషట్చక్రం శక్తిస్థాన ముదీరితం
కంఠాదుపరి మూర్ధాంతం శాంభవం స్థాన ముచ్యతే.
(యజుర్వేదీయ వరాహోపనిషత్)

255. అహ మటన్న శబ్ద మందఱ కందదు
ఇహ మటన్న నందు నెల్లరకును
అహమిహోలు గోర రానందయోగులు
కాళికాంబ! హంస! కాళికాంబ!

256. బరిణలోని గంధపరిమళద్రవ్యాలు
కోవెలందు నుంచ గుప్పుమనును
వల్ల కాటినుంచ పరిమళ మ్మించునా?
కాళికాంబ! హంస! కాళికాంబ!

257. జగతియందు లేవు సప్తసముద్రాలు
తనువులోన గలవు తరచిచూడ
ఉప్పునీటి దుండు నొక్క సముద్రమే
కాళికాంబ! హంస! కాళికాంబ!

258. ఆత్మలోన నుండునదియె వైకుంఠమ్ము
[1]కోణదేశమున [2]వికుంఠుడుండు
లోక మేది లేదు లోకోత్తరుడు లేడు
కాళికాంబ! హంస! కాళికాంబ!

259. పరుల శరణు గోర పరమాత్మ నవ్వును
నరుల హీనదశల నరసి యరసి
గురుని శరణు గోర పరమాత్మ లొంగును
కాళికాంబ! హంస! కాళికాంబ!

260. తిరమటంచు నెంచి దేహమ్ము పోషించు
తిండిపోతు జగతి దేహవాది
ఆత్మవాది మాట లచ్చట ముచ్చటే
కాళికాంబ! హంస! కాళికాంబ!

---

1. కోణదేశము = ఇంటిమూలచోటు
2. వికుంఠుడు = మూఢుడుగాని వాడు – (జ్ఞాని)

261. నీ కటాక్షలవము సోక లోకము వెల్గు
సకలలోకములకు జనని వగుట
నిన్ను సంస్తుతింప నేనెంత వాడను
కాళికాంబ! హంస! కాళికాంబ!

262. యుగయుగాల నాట్యమొనరింపు నేర్తువు
శాశ్వతముగ విశ్వశాంతి నిడుదు
నశ్వరమ్ముగాని ఐశ్వర్య మిడుదువు
కాళికాంబ! హంస! కాళికాంబ!

263. బహుకుటుంబినివిగ ప్రఖ్యాతి నందితి
సృష్టి చేసి యొసగు దిహపరాల
నీకు నీవె సాటి లోకాల నన్నింట
కాళికాంబ! హంస! కాళికాంబ!

264. బ్రహ్మవాదినివిగ పరతత్వబోధలు
సలిపి దుర్మతాల దులుప గలవు
పర మనంగ నీవె పరతత్వ మన నీవె
కాళికాంబ! హంస! కాళికాంబ!

265. కాళికాంబ యనుట లీలావినోదంబు
కాదు కాదు హంస కాళికాంబె
హంస కాళికాంబె ఆత్మకాళిక సుమా!
కాళికాంబ! హంస! కాళికాంబ!

266. నాల్గు పదవు లంద నటియించు నొకమాఱు
నిక్కి వెలుగు చూచు నొక్కతూరి
పదవి వెలుగు "బట్టబయ లౌను" గురుమూర్తి
కాళికాంబ! హంస! కాళికాంబ!

267. నామ రూపములను నటియించు లోకమ్ము
అస్తి భాతి ప్రియము లగును బయలు
చిరపురాతనమ్ము పరిపూర్ణతత్వమ్ము
కాళికాంబ! హంస! కాళికాంబ!

268. చీకు మబ్బులోన జీరాడు జీనికి
చొక్కమైన దారి చూపువాడె
గురుడుగాని గుండగొయ్యలు గురువులా?
కాళికాంబ! హంస! కాళికాంబ!

269. భక్తిలేక జనులు వాదోపవాదాల
లోన మునిగి పరము కానరైరి
ఆశ తెగని గురువు లారాటపడుదురు
కాళికాంబ! హంస! కాళికాంబ!

270. స్త్రీలలోన నొక పతివ్రత లేకున్న
పురుషులందు పుణ్యమూర్తి లేక
ధర్మకర్మచయము దగ్ధమై పోవదా!
కాళికాంబ! హంస! కాళికాంబ!

271. ఆస కోసివేసి ఆపైని తెరలన్ని
చీల్చివైచి గురుని జేరవలయు
గురునిజేరి శరణుగోర సిద్ధుండౌను
కాళికాంబ! హంస! కాళికాంబ!

272. ఆఱు కమలములకు నావలి బయలులో
బ్రహ్మరంధ్ర మనెడి బాట కలదు
బాటవెంట నడువ పరమపద మ్మేగు
కాళికాంబ! హంస! కాళికాంబ!

273. మాయలోన బుట్టి మాయలో బెరిగియు
మాయలోన మడియు మానవుండు
మాయ గుట్టురట్టు మఱి యెవ్వ డెఱుగడు
కాళికాంబ! హంస! కాళికాంబ!

274. ఆకసమ్మటన నవకాశ మనినారు
చూతమన్న నదియు శూన్యమాయె
శూన్యవాదులెల్ల శోధించి చెప్పిరి
కాళికాంబ! హంస! కాళికాంబ!

275. మాట పెరుగ పెరుగ చేటు చేకూర్చును
మాయదారి మాయ మాయ చేయు
మాటమాయ లొొక్కబాట బట్ట నశించు
కాళికాంబ! హంస! కాళికాంబ!

276. అంకు రట్టుచేయు బ్రహ్మాండభాండమ్ము
లాత్మతత్వ మరయ నడ్డుపడును
పాఱజూడవచ్చు ఫాలాక్షుడైనచో
కాళికాంబ! హంస! కాళికాంబ!

277. పాచిపీనుగైన బలవంతు డైనను
భీరువైన లేక ధీరుడైన
పెత్తనమ్ము చేయ తత్తరించు జనుండు
కాళికాంబ! హంస! కాళికాంబ!

278. రోష ముడుపగలదు కాషాయవస్త్రమ్ము
శాంతి నీయగలవు జపము తపము
సర్వ మీయగలదు సద్గురు సంసేవ
కాళికాంబ! హంస! కాళికాంబ!

279. నరునిజన్మ వాసనావాసితమ్మయి
మిగుల దిగులుతోడ బుగులు కొనును
సర్వవాసనలకు స్వస్తి చెప్పు మహర్షి
కాళికాంబ! హంస! కాళికాంబ!

280. ఆకసమ్ములోన భీకరార్భటి రేగ
ముచ్చముడుగజేయు మునివరుండు
ప్రణవ మొకటె పట్టు వదలకు చేపట్టు
కాళికాంబ! హంస! కాళికాంబ!

281. బాల్యమందు చపలభావమ్ము బాధించు
యౌవనమున కామ మదరజేయు
వార్ధకమ్మునందు వాంఛలు చెలరేగు
కాళికాంబ! హంస! కాళికాంబ!

282. మాయ దేవుడాయె మనసు పూజా రాయె
దొంగభక్తి యగురుధూప మాయె
నాలిముచ్చుదనమె నైవేద్యమైపోయే
కాళికాంబ! హంస! కాళికాంబ!

283. పుట్టి పెరిగి చచ్చు పోడిమి యెఱుగక
బట్టబయలు చట్టుపగిది నుండు
కానుపించు మాయ లేనిది యున్నట్లు
కాళికాంబ! హంస! కాళికాంబ!

284. బ్రహ్మ మొక్కడన్న పలుకు పాటింపక
గుడులు నిలిపి మ్రొక్కు బడులు పెట్టి
తిక్కబట్టి జనులు తిరుగుచునున్నారు
కాళికాంబ! హంస! కాళికాంబ!

285. పూర్ణబోధ నంది బొందితో కైలాస
మందుకొనిరి పూర్వమందు ఋషులు
యోగి జోగియైన నుత్పాత మేతెంచు
కాళికాంబ! హంస! కాళికాంబ!

286. చచ్చుపుచ్చుకైత పచ్చి శృంగారాన
చెప్పి కవులు మున్ను మెప్పుగనిరి
నీతినిష్ఠలెల్ల నిప్పుల పాలాయె
కాళికాంబ! హంస! కాళికాంబ!

287. వట్టి మాటచేత వైష్ణవుండును గాడు
భూతిపూయ శైవనేత గాడు
మనసు నిలుపువాడె మాన్యుండు ధన్యుండు
కాళికాంబ! హంస! కాళికాంబ!

288. జీవకోటికెల్ల శ్రేయమ్ము దలచెడు
పారమార్థికునకు పట్టుదొరకు
పరుల హింసపెట్టు పాపి యాతన లందు
కాళికాంబ! హంస! కాళికాంబ!

289. వాక్కునందు నీవు వదలక యున్నచో
సిద్ధుడగును జీవసిద్ధి నందు
నీవులేనినాడు నిర్భాగ్యు డతడౌను
కాళికాంబ! హంస! కాళికాంబ!

290. పరులదిట్ట నోరు పాపపంకిల మౌను
పెద్దలను నుతింప సుద్ధి యగును
నోటిమంచితనము పాటించు సుజ్ఞాని
కాళికాంబ!హంస! కాళికాంబ!

291. సాటిమానవునకు సాయమ్ము పడబోక
నల్లరాళ్లు తెచ్చి గుళ్లుకట్టి
మ్రొక్కులిడిన బ్రతుకు చక్కపడంబోదు
కాళికాంబ!హంస!కాళికాంబ!

292. బాట నూటియైన వైకుంఠమున కేగు
దారితప్ప పడును నారకమును
మంచిచెడ్డ లేర్పరించి చూచినమేలు
కాళికాంబ! హంస!కాళికాంబ!

293. [1]కట్టె చేతనున్న కఱవబోవదు కుక్క
గురుని గుఱు తెఱుగదు గుడ్డికుక్క
గుడ్డి కుక్కలకును గూటాల దెబ్బలు
కాళికాంబ! హంస! కాళికాంబ!

294. అష్టమదము లున్న అధమాధముం డగు
కష్టపడెడు వాడు ఘనుడు జగతి
పరులకూటి కాసపడును దౌర్భాగ్యుండు
కాళికాంబ! హంస! కాళికాంబ!

295. పరుసవేదివలన బంగారమగు నిన్ను
గురునివలన శిష్యవరుడు వెలుగు
మంచి సాహచర్య మెంచి చూచుట మేలు
కాళికాంబ! హంస! కాళికాంబ!

296. సర్వమానవులను సమముగా ప్రేమించు
కులమతాల నెంచి కోపపడకు
కాపుజాతినెల్ల కరుణించు మనెశ్రుతుల్
కాళికాంబ! హంస! కాళికాంబ!

---

1. కట్టె=కఱ్ఱ (కడప మాండలికము)

296. ప్రియం సర్వస్య పశ్యత ఉతశూద్ర, ఉతార్యే.
(అధర్వణ వేదము 19-62-1)

297. మహిమతోడ యంత్ర మంత్ర తంత్రాగము
శాస్త్రచయము నిన్నె సంస్తుతించె
భక్తజనులపాలి పారిజాతమ నీవు
కాళికాంబ! హంస! కాళికాంబ!

298. మంత్ర తంత్ర యంత్ర మహాత్మ్య గాథలు
భారతీయులకును భారమాయె
జనులపాలి కివియె శాపనార్థము లాయె
కాళికాంబ! హంస! కాళికాంబ!

299. గాఢతమములైన మూఢవిశ్వాసాల
జలధిలోన మునుగు జనుల కెల్ల
స్వేచ్ఛగోరువాడె సిద్ధుండు బుద్ధుండు
కాళికాంబ! హంస! కాళికాంబ!

300. ఆటవికుల కెల్ల ఆధ్యాత్మతత్వమ్ము
బొధన చేసి పూర్ణపురుషులుగును
తీర్చి దిద్దువారె దేవతామూర్తులు
కాళికాంబ! హంస! కాళికాంబ!

301. భక్తజనుల కెల్ల పరమశరణ్యమ్ము
మోక్షసాధనము; ముముక్షువులకు
ఆత్మతత్వ మెఱుగనగు మార్గమొక్కటే
కాళికాంబ! హంస! కాళికాంబ!

302. విద్యనిర్మల మ్మవిద్య మాలిన్యమ్ము
మలినమైన ప్రకృతి మాయ యగును
మాయతొలగ నచలమార్గమ్ము కాన్పించు
కాళికాంబ! హంస! కాళికాంబ!

303. జన్మజన్మములను సముపార్జితమ్మైన
పుణ్యలవమువలన ముక్తి గలుగు
భుక్తి గోరువారు మోక్షమ్ము గనలేరు
కాళికాంబ! హంస! కాళికాంబ!

304. శంకరునకు నీవు సౌందర్యలహరివై
కానుపించి మించి కరుణతోడ
మనిచితీవు శిష్టమార్గానువర్తుల
కాళికాంబ! హంస! కాళికాంబ!

305. వదలవలయు జాతి వర్ణ వ్యవస్థలు
పట్టవలయు గురుని పాదయుగము
మ్రొక్కవలయు నీదుమూర్తికి ముక్తికై
కాళికాంబ! హంస! కాళికాంబ!

306. సత్యహీనమైన జనుని తపమ్మును
జపము – వ్యర్థమనియె శాస్త్ర చయము
నిత్య సత్యరూపిణివి నీవ జగదంబ!
కాళికాంబ! హంస! కాళికాంబ!

307. బ్రహ్మసూత్ర భాష్య పంక్తులు వల్లించి
ఆచరింపకున్న అధముడగును
భేదబుద్ధి విడువ వేదాంతవేత్తయౌ
కాళికాంబ! హంస! కాళికాంబ!

308. హరుని భక్తులెల్ల పెరియపురాణాన
నాయనార్లుగాగ వ్రాయబడిరి
సర్వకులములందు సంభవించిరి వీరు
కాళికాంబ! హంస! కాళికాంబ!

309. తెట్టగట్ట బూది, తిరుమణి, తిరుచూర్ణ
ములు మొగాన బూయ ముక్తిరాదు
చిత్తశుద్ధిలేని చేష్టలు దుష్టాలు
కాళికాంబ! హంస! కాళికాంబ!

310. బుజము గాల్చుకొన్న బుజముపై జందెపు
పోగు వేసికొన్న ముక్తిరాదు
నేను మేనులోన నే నెఱింగిన ముక్తి
కాళికాంబ! హంస! కాళికాంబ!

311. ప్రకృతి వికృతితత్వ పరిగణనమ్ములో
కృషి యొనర్చువాడె ఋషి, మహర్షి
రెండుగానివాడు రండముండల బిడ్డ
కాళికాంబ! హంస! కాళికాంబ!

312. అదియు నేను గాని దద్వైత తత్వమ్ము
నేను నేనె – నీవు నీవె ద్వైత
మచలబోధ కత్తియంచుపై నడచుట
కాళికాంబ! హంస! కాళికాంబ!

313. వ్యక్తిగతముకాక వ్యష్టి సమష్టిగా
నీ స్వరూప మరసి నిఖిలమునులు
జనన మరణ రహిత సామ్రాజ్య మేలిరి
కాళికాంబ! హంస! కాళికాంబ!

314. కాంతివెంట నంధకార మున్నట్లుగా
పగలు వెంట రాత్రి పడిన రీతి
మంచి వెంట చెడ్డ మసలక తిరుగాడు
కాళికాంబ! హంస! కాళికాంబ!

315. దుష్టశిక్షణమ్ము శిష్టరక్షణమును
చేయ దేవతలను సృష్టిచేసి
జగములెల్ల కాచి జగదంబ వైతివి
కాళికాంబ! హంస! కాళికాంబ!

316. వీలువాలు లేని వెంగలి రాయళ్ళు
ముక్తి కొఱకు గాక భుక్తి కొఱకు
చదివి వేదములను సమత పోనాడిరి
కాళికాంబ! హంస! కాళికాంబ!

317. అన్నిరూపములకు ఆధారమై యుండి
రూపరహితవంచు రూఢి కెక్కి
కాళికాంబవైతి పాలింప భక్తుల
కాళికాంబ! హంస! కాళికాంబ!

318. పరమగమ్యమైన బ్రహ్మవిద్యవు నీవ
సర్వదర్శనముల సార మీవ
శతసహస్ర కోటి శాస్త్రార్థములు నీవ
కాళికాంబ! హంస! కాళికాంబ!

319. స్వార్థపరత పెంచి పరసౌఖ్యముల ద్రుంచి
తనకు గలుగుదాన తనియలేక
లోకములను మ్రింగ లోనెంచు నీచుండు
కాళికాంబ! హంస! కాళికాంబ!

320. శక్తి యుక్తుడైన సద్గురు సాన్నిధ్య
మందు నిలిచి బోధనందు వాడు
తన్నుదాను మఱచి తాదాత్మ్యమున నుండు
కాళికాంబ! హంస! కాళికాంబ!

321. ప్రొద్దుపొడువ నీదు మూర్తిని దర్శించి
పట్టపగలు నిన్నుభక్తి గొలిచి
సందె జామునందు సంస్తుతించిన ముక్తి
కాళికాంబ! హంస! కాళికాంబ!

322. ధర్మరహితులెల్ల తాత్కాలికమ్ముగా
భోగభాగ్యములను పొందవచ్చు
ఆత్మలోని బాధ లంతలింతలు గావు
కాళికాంబ! హంస! కాళికాంబ!

323. సాధుజనుడ నంచు సమ్మానముల నంద
గోరువాడు నిన్ను గోలుపోవు
జనుడుగాడు వాడు జడుడు ముమ్మాటికీ
కాళికాంబ! హంస! కాళికాంబ!

324. బాహ్యమైన భువన మేహ్యమౌ - దేహమ్ము
ప్రకృతివలన గలుగు వికృతియగుట
గోప్య మెఱుగ రెంటి కాప్యాయతలు మెందు
కాళికాంబ! హంస! కాళికాంబ!

325. గాలిరీతి విశ్వగోళాలలో నుందు
దివుల భువుల మధ్య తిరుగ గలవు
నీవు లేనిచోటు నిక్కమ్ముగా లేదు
కాళికాంబ! హంస! కాళికాంబ!

326. సకలమునకు శక్తి శాశ్వతాధారమై
నిలుచునంచు బలికె నిగమతతులు
స్త్రీ నిజమ్ముగాను సృష్టికి మూలమ్ము
కాళికాంబ! హంస! కాళికాంబ!

327. శైవశాక్తములు విచారింప చిరపురా
తనములంచు బలికి రనఘమతులు
అల్పమతులు దక్షిణాచార మన్నారు
కాళికాంబ! హంస! కాళికాంబ!

328. నీతి రీతి లేక నైతిక పతితులై
నరులకుండు లక్షణములు మఱచి
క్రూరజంతువులుగ మాఱిపొయిరి జనుల్
కాళికాంబ! హంస! కాళికాంబ!

329. కడుపుమంట దీర్పగా దినవలె దేహి
మిక్కుటముగ తిండి మెక్కువాని
పట్టి బందిలోన పడవేయవలె రాజు
కాళికాంబ! హంస! కాళికాంబ!

330. తత్వవిదుల సృష్టి ధ్యానోపనిషదలు
కవుల సృష్టి మంత్రకాండ మెల్ల
బ్రహ్మణముల సృష్టి వరపురోహితులది
కాళికాంబ! హంస! కాళికాంబ!

331. భద్రమైన బూది, రుద్రాక్షమాలలు
శూలిభక్తులకును సొమ్ములాయె
తులసిమాల వైష్ణవుల భూషణ మ్మాయె
కాళికాంబ! హంస! కాళికాంబ!

---

329. యావత్ భ్రియేత్ జఠరం
తావత్ స్వత్వంహి దేహినాం
అధికం యోZభిమన్యేత
స స్తేనో దండమర్హతి.
(శ్రీమద్భాగవతం 7-14-3)

332. విజ్ఞుడైనవాడు 'వేదాంతియగువాడు,
ఎఱుకవాడు, శక్తి నెఱుగువాడు
నీ వెవండ వనిన నేను బ్రహ్మంబను
కాళికాంబ! హంస! కాళికాంబ!

333. అన్యవిద్యలెల్ల నాహారమును గూర్చు
బ్రహ్మవిద్య బట్టబయలు చేర్చు
బయలు బ్రహ్మమన్న పరమేశ్వరివి నీవె
కాళికాంబ! హంస! కాళికాంబ!

334. శ్రుతములైన వెల్ల శ్రుతులాయె వానినే
స్మరణచేయ స్మృతుల కరణి మాఱె
శ్రుతులు, స్మృతులు నిన్ను నుతియించు సర్వదా
కాళికాంబ! హంస! కాళికాంబ!

335. కాళివైననిన్ను గౌరిగా, ఉమగాగ
పార్వతిగను కవులు ప్రస్తుతించ
శివుని భార్యగాగ చివరకు దేల్చిరి
కాళికాంబ! హంస! కాళికాంబ!

336. తల్లిప్రేమలోన తగులదు మాలిన్య
మెల్లభంగులను సహించుకొనును
తల్లిపదము విన్న నుల్లమ్ము రంజిల్లు
కాళికాంబ! హంస! కాళికాంబ!

337. నిన్ను చూడగోరు నిపుణుండు పసిపాప
యగు నతండె దైవ మరయ గలడు
అమ్మయన్న పిలుపు నమృతధారను మించు
కాళికాంబ! హంస! కాళికాంబ!

338. కుంటి(గుడ్డియైన కొడుకుల విడనాడ
బోవ దెపుడు మాతృమూర్తి మహిని
దైవ మట్లె భక్తతతి విడనాడదు
కాళికాంబ! హంస! కాళికాంబ!

339. జీవులకును "మాతృదేవోభవ" యటంచు
శ్రుతులు స్మృతులు పలికె శుద్ధముగను
మాతృమూర్తి మించు మఱి దైవమే లేదు
కాళికాంబ! హంస! కాళికాంబ!

340. తత్వవేత్తలెల్ల సత్వరజస్తమో
గుణములను దృజించి నిను భజించి
ముక్తసంగులైరి మోక్షాధిపతులైరి
కాళికాంబ! హంస! కాళికాంబ!

341. మతియు ధృతియు స్మృతియు క్రతువు నీవైయుండ
బక్క దేవతలకు మ్రొక్కనేల?
చిక్కు దీర్చగలరె చిల్లర దేవుళ్లు?
కాళికాంబ! హంస! కాళికాంబ!

342. శరణు గోరుచుంటి సకలజగత్తుకు
శాంతి గూర్పగలుగు శక్తి వంచు
నీ పదార్చనమున బ్రాపించు మోక్షమ్ము
కాళికాంబ! హంస! కాళికాంబ!

343. అంబ గొలిచి సచ్చిదానందలహరిలో
ఈదులాడు జీవి మోదమందు
తల్లి గొలువనట్టి తనయులు తనయులా?
కాళికాంబ! హంస! కాళికాంబ!

344. శాంకరివిని నీవ ఓంకారమును నీవ
శ్యామలాంబ వీవ చండి వీవ
సోహమనెడి మంత్రసూ క్షసూత్ర మీ్మన
కాళికాంబ! హంస! కాళికాంబ!

345. వాసనాత్రయమ్ము నాశన మ్మొనరింప
భేదవాదములను పెళ్ళగింప
చిత్తవృత్తులెల్ల [1]శీర్షమౌ [2]జీర్ణమౌ
కాళికాంబ! హంస! కాళికాంబ!

346. మలినసహిత దేహమండప మ్మందున
మలినరహితు డగుచు మలగు దేహి
దేహి దేహములకు దీపమ్ము నీవెగా
కాళికాంబ! హంస! కాళికాంబ!

347. పరమతత్వబోధ – గురుభక్తిహీనుండు
మాయికుండు, భూతమాత్రికుండు.
మత్సరుండు, విత్తమత్తుం డెఱుంగడు
కాళికాంబ! హంస! కాళికాంబ!

348. దేహధారులెల్ల దేహేంద్రియాదుల
బంధనముల జిక్కి పరము గనక
పుట్టిచచ్చి చచ్చిపుట్టుచు నుందురు
కాళికాంబ! హంస! కాళికాంబ!

349. పూజనీయ రాజరాజేశ్వరివి నీవు
ముగురుమూర్తులకును మూల మీవు
జగతికెల హర్షసంధాయినివి నీవు
కాళికాంబ! హంస! కాళికాంబ!

---

1. శీర్ణము = సన్నగిల్లినది, 2. జీర్ణము = చినిగినది.

350. ఈహ వీడలేక దేహేంద్రియాదుల
తృప్తిపఱుప దారితెన్ను వదలి
తిరుగు పాపులెల్ల నరకాన బడుదురు
కాళికాంబ! హంస! కాళికాంబ!

351. పూర్ణముగను రేచ పూరక కుంభకా
లభ్యసింప గాలి యాటకట్టు
గాలి యాటకట్టు కాళిక నీవౌదు
కాళికాంబ! హంస! కాళికాంబ!

352. రేయి పగలు తిరుగు రేచక పూరక
క్రమము మాని కుంభకమును పూని
నిలుచువారు పాపనిర్ముక్తు లగుదురు
కాళికాంబ! హంస! కాళికాంబ!

353. పుట్టు గ్రుడ్డివాని పోల్కి కన్నుల నుంచు
చెవిటివాని రీతి చెవుల నుంచు
శాంతికామునకును సర్వమ్ము చేకూరు
కాళికాంబ! హంస! కాళికాంబ!

354. చిత్తవిభ్రమమున జీవేశ్వరులు వేఱు
వేఱటంచు దలచు వెఱ్ఱివాడు
కలిసియుండుగాదె ఘటమఠాకాశముల్
కాళికాంబ! హంస! కాళికాంబ!

---

352. రేచకం పూరకం ముక్త్వా
కుంభకం నిత్య మభ్యసేత్
సర్వపాప వినిర్ముక్తః
సమ్యగ్జ్ఞాన మవాప్నుయాత్, (దర్శనోపనిషత్-90)

355. జననమరణదుఃఖ సాగరమ్మున నుండి
పరమపదము చేర్చు గురువరుండు
నిత్యసత్యమైన ప్రత్యక్ష దైవమ్ము
కాళికాంబ! హంస! కాళికాంబ!

356. నాదియన్న బంధనమ్ముల జిక్కును
నీదియన్న చెఱల నిర్గమించు
నీది నాది యనక నిర్గుణబ్రహ్మమౌ
కాళికాంబ! హంస! కాళికాంబ!

357. కాలరూపిణివిగ శూలధారణివిగా
పూజలందు దేవమోహినివిగ
భద్రకాళివంచు భజియింతు రార్యులు
కాళికాంబ! హంస! కాళికాంబ!

358. వేదధర్మములకు పాదైన చోటులు
నిన్ను సంస్తుతించి వన్నెగనియె
దివ్యతత్వ మీవె భవ్యరూప మీ్మవె
కాళికాంబ! హంస! కాళికాంబ!

359. సూక్తములను నీవె సూత్రమ్ములను నీవె
ఉపనిషత్తులందు నుంటి నీవు
నీవు లేనిచోటు నింగి నేలను లేదు
కాళికాంబ! హంస! కాళికాంబ!

360. పుటుకతోడ జ్ఞానమును పొందు సిద్ధుండు
యోగమునకు జ్ఞాన మొందుయోగి
నీ కటాక్షములవము సోక ధన్యులు జనుల్
కాళికాంబ! హంస! కాళికాంబ!

361. సాంఖ్యయోగములను సాధింపవచ్చును
బ్రహ్మపదము చేరవచ్చు దాన
రాజయోగులకును రాచబా టదిగదా!
కాళికాంబ! హంస! కాళికాంబ!

362. నిరుపమానమైన నిశ్రేయసము నించు
తరతరాల కర్మతతుల ద్రెంచు
శిరముపైని చేయిచేర్చి సద్గురుమూర్తి
కాళికాంబ! హంస! కాళికాంబ!

363. శ్వాసకోశములను చక్కనుంచెడి వాడు
స్నాన పాన భోజనముల నెఱిగి
చేయువాడు యోగసిద్ధు డాచార్యుడౌ
కాళికాంబ! హంస! కాళికాంబ!

364. తళుకుబెళుకు వస్త్రములు దాల్చువారలు
వ్రేళ్ల నుంగరములు పెట్టువారు
వాని విలువ దప్ప వారికి వెలలేదు
కాళికాంబ! హంస! కాళికాంబ!

365. జిహ్వారుచుల కొఱకు జీవితలక్ష్యమే
విడుచువాడు తత్వవేత్త కాడు
నాల్క గట్టువాడు నారాయణుం డౌను
కాళికాంబ! హంస! కాళికాంబ!

366. సర్వజీవులందు చైతన్య మొకడంచు
జాతిమతము లెంచి సణుగువారు
అందలేరు సచ్చిదానంద సౌఖ్యమ్ము
కాళికాంబ! హంస! కాళికాంబ!

367. సారహీనమైన సంసార సుఖదుఃఖ
ములకు లోగువాడు మూర్ఖజనుడు
సాక్షిమాత్రుడైన సర్వేశతుల్యుడౌ
కాళికాంబ! హంస! కాళికాంబ!

368. ఆగమమ్ములను మహారణ్యమున బడి
ఆగమగుట యేల? అంబ! నిన్ను
ఆత్మ దలచి మోక్ష మందిన చాలదా!
కాళికాంబ! హంస! కాళికాంబ!

369. మాటలకును మాఱుమాటలు పల్కుట
నోటి తీటగాని బాటగాదు
వాద ముడుగువాడె నీదరి చేరును
కాళికాంబ! హంస! కాళికాంబ!

370. శోకరహితమైన చోటుకు జేరగా
కోరువారె నిన్ను జేరువారు
నిశ్చయముగ మనసు నిల్వ నీదయగల్గు
కాళికాంబ! హంస! కాళికాంబ!

371. వేదమంత్రములను వాదించి విడిచిన
విధి నిషేధ శాస్త్రవేత్తలైన
గుణము కుదరకున్న నిను గాంచగా లేరు
కాళికాంబ! హంస! కాళికాంబ!

372. సడలనీనిభక్తి సామీప్య సారూప్య
ములకు జేర్చు తుదకు ముక్తి గూర్చు
నీవె తానుగాను నిల్చు సాయుజ్యమై
కాళికాంబ! హంస! కాళికాంబ!

373. పారమార్థికముగ బ్రహ్మాత్మతత్వమ్ము
లెఱుగ గోరువారు గురుని జేరి
కొలువవలయు నిలిచి గురుతర గురుభక్తి
కాళికాంబ! హంస! కాళికాంబ!

374. ద్వేష మింత లేక వేషమ్ము పస లేక
శత్రుమిత్రులందు సమత గలిగి
బంధముక్తు డగుట భక్త, లక్షణమగు
కాళికాంబ! హంస! కాళికాంబ!

375. సంప్రదాయముగను సద్గురు సచ్ఛిష్య
మార్గముల నెఱింగి మదిని నిన్ను
దలచువార లెల్ల ధన్యులు మాన్యులు
కాళికాంబ! హంస! కాళికాంబ!

376. పరము గోరు శక్తి గురువునం దనురక్తి
కాళికాంబయందు గలుగుభక్తి
మూడు పూర్వసుకృతమున గల్గు జీవికి
కాళికాంబ! హంస! కాళికాంబ!

377. అత్త, కోడ లిర్వు రాగడమ్ములు మాని
ఒకటిగాగ నుంట నుర్వి లేదు
అత్తలేని కోడ లుత్తమరా లండ్రు
కాళికాంబ! హంస! కాళికాంబ!

378. నేనె బ్రహ్మ మనుచు నిర్దిష్ట నిర్దుష్ట
ముగను బలుక జనులు తెగడినారు
బాధగురువు లిదియు బోధగా దన్నారు
కాళికాంబ! హంస! కాళికాంబ!

379. సర్వమతములందు సారమ్ము గ్రహియించి
ఐకమత్యమార్గ మనుసరించి
క్రించుదనము మాని ప్రేమించుకొన మేలు
కాళికాంబ! హంస! కాళికాంబ!

380. భవుడు దిక్కటన్న భక్తులకే కాక
కాడు దిక్కటన్న ఘనుల కేల
స్వర్గ నరక మోక్ష సంవాసముల గోల
కాళికాంబ! హంస! కాళికాంబ!

381. పాపరూపమైన తాపత్రయాదుల
పరిహరించి జయ, శివంకరముల
చేర్చికూర్చు తల్లి శివశక్తి వీవెగా
కాళికాంబ! హంస! కాళికాంబ!

382. పరము దిక్కటంచు దిరుగుచు నుండగా
[1]కల్లగుల్ల గురుడు కానవచ్చె
చుండునెత్తిమీద నుండిన పేనుగా
కాళికాంబ! హంస! కాళికాంబ!

383. ఆత్మలోని జోతి నారగించగవలె
ప్రాణలింగ మరసి బ్రతుకవలెను
బయలు జ్యోతి జూచి ప్రకృతిని గనవలె
కాళికాంబ! హంస! కాళికాంబ!

---

381. తాపాపహారిణీం దేవీం
భుక్తిముక్తి ప్రదాయినీం
అనంతాం విజయాం శుద్ధాం
శరణ్యాం శివదాం శివామ్. (దేవ్యుపనిషత్తు -19)

1. కల్లగుల్ల = అసత్యములాడు

384. నాల్కమీద జాతినవరత్నముల గూర్చి
ఆదిదేవు ధ్యాన మందవలెను
నమలి రుచినిగన్న నారాయణుని గను
కాళికాంబ! హంస! కాళికాంబ!

385. నోటి నాల్కసందు పాటిరోకలి యున్న
రామభజన చేయరాదు నోట
పాపకర్మనోట పట్టునో పట్టదో
కాళికాంబ! హంస! కాళికాంబ!

386. నోరు బరిణెయందు నారాయణుం డుండు
దివ్యమైన స్థలము దెలియ నాయె
తిరిగి తెలియలేరు దివ్యస్థలంబని
కాళికాంబ! హంస! కాళికాంబ!

387. శిష్యునకును బోధచేసెడి గురుమూర్తి
సంశయముల నెల్ల సమయజేయ
తత్వ మెఱిగి యతడు ధన్యోస్మి యనవలె
కాళికాంబ! హంస! కాళికాంబ!

388. వాక్కు బ్రహ్మమనుచు వర్ణింప నేరరో
చూపు నీశు డనుచు చూడలేరొ
కోర్కి విష్ణు వౌట కొనసాగ నీయరో
కాళికాంబ! హంస! కాళికాంబ!

389. బ్రహ్మ మనగ వేఱె పరదేశమున లేదు
బ్రహ్మమనగ జూడు బట్టబయలు
తనకు దానె బ్రహ్మ తారక మౌనురా!
కాళికాంబ! హంస! కాళికాంబ!

390. తనుకు దానె బ్రహ్మ తారక మెట్లౌను
తొలుత నోముఫలము తెలిసి యుంటె
ఆనుకూల్యవతియె యా మహాబ్రహ్మయౌ
కాళికాంబ! హంస! కాళికాంబ!

391. న్యాయ మేమటంచు నసిగేరు పెద్దలు
పిన్నవారి కెల్ల పేరు లేదు
బ్రహ్మ మరయువారి భ్రమ లిట్టు లుండునా
కాళికాంబ! హంస! కాళికాంబ!

392. ప్రమథనాథుగూర్చి పఠన చేయగవలె
కఠిన చిత్తుకైన శఠునకైన
అహము శూన్యమైన హఠయోగులకు నైన
కాళికాంబ! హంస! కాళికాంబ!

393. [1]దీప్తమైన గురుడు దేహమం దుండగా
దాహ [2]శూకలంబు దగ్ధమాయె
నిద్రమోహములకు నిలిచి సద్గురు డుండె
కాళికాంబ! హంస! కాళికాంబ!

394. వినుము తల్లి! నీకు వినిపింతు నొకవార్త
కనుము తల్లి! గురుని కాంక్షలేక
మనుము తల్లి! ఆత్మమహిమంబు తెలిపెద
కాళికాంబ! హంస! కాళికాంబ!

395. పేరు మనసుమాయ పెనుబాము సమమౌను
పెద్ద బ్రహ్మపేర పిలువనాయె
మనసు వాయు వవుట మరియాద తెలియరో
కాళికాంబ! హంస! కాళికాంబ!

---

1. దీప్తము = సింహము,
2. శూకలము = దుష్టాశ్వము

396. గురుధనము [1]గుడారు [2]గూర్చి వేసితెకాని
అగరు గంధములను నలదినటుల
మానసమున కెన్ని మాయలు చెప్పుమా?
కాళికాంబ! హంస! కాళికాంబ!

397. గురునిబుద్ధియందు గూర్చి వేసినయట్లు
పట్టువిడుపు లేక పట్టవలెను
పట్టుకాఱు పట్టి పట్టుగా పట్టుడు
కాళికాంబ! హంస! కాళికాంబ!

398. పట్టు పట్టెనేని పట్టు వీడగరాదు
పట్టు వదలెనేని పదవిలేదు
పట్టి విడుచుకంటె ప్రాణమ్ము [3]లిడ మేలు
కాళికాంబ! హంస! కాళికాంబ!

399. గురునిసూత్రమైన కుక్కలు గఱవవు
గుణము లేకయున్న కుక్క గఱచు
కుక్కకున్న గుణము గురునకు లేదయా
కాళికాంబ! హంస! కాళికాంబ!

400. గురుడు గురునిగుణమె కుక్క కుక్క గుణమ్మె
ఒక్కటైతె రెండు చక్కనౌను
చక్కనైన గుణమె యెక్కువౌ లెక్కింప
కాళికాంబ! హంస! కాళికాంబ!

401. దగులు బాజివాడు దైవమ్ము గనలేక
చుట్టు కోట బెట్టి చూడనీడొ
కోటగమ్యు మెఱిగి బూటక మిడవలె
కాళికాంబ! హంస! కాళికాంబ!

---

1. గుడారు = డేరా, 2. కూర్చి= అలంకరించి, 3. ఇడు = విడిచిపెట్టు

402. చట్ట మరయలేక స్వామి లేడందురు
వట్టిమాట లిట్లు వదరనేల
దిట్టమైనగురుడు దేదీప్యమై యుండ
కాళికాంబ! హంస! కాళికాంబ!

403. నాల్గుయుగములందు న్యాయ్యమ్ముగా జూడ
నెన్నదగిన రాజు లెవరుగలరు
గురుని నమ్మువాడు భరతు డొక్కండేను
కాళికాంబ! హంస! కాళికాంబ!

404. పదవులంది పట్టువడకుండు వ్యవహారి
ఇంద్రియముల గెలుచు నిద్దయోగి
హర్షశోకములను నధిగమించు సమాధి
కాళికాంబ! హంస! కాళికాంబ!

405. రాజు జ్ఞానియైన, రాజసంబున నున్న
యోగమెంతొ తెలుపు నుచితరీతి
ప్రకృత మున్న దొరలు పరమాత్మ లవుదురా!
కాళికాంబ! హంస! కాళికాంబ!

406. రాజుచిన్నె మీకు లాభం బవునుగాని
యోగిచిన్న మీకు యుక్తమగునె
రాజుచిన్నెమీకు రాగొట్టు పోగొట్టు
కాళికాంబ! హంస! కాళికాంబ!

---

404. త్రివిధోహి బ్రహ్మవిత్ –
1. లోకవ్యవహార ప్రధానః
2. వివేక ప్రధానః
3. సమాధి ప్రధానశ్చేతి.
(తైత్తిరీయోపనిషత్ భాష్యభూమిక)

407. రాజుచిన్నె భరతరాజంత వాడైతె
రాకపోకలెల్ల పోకనిలిచె
రాజయోగమార్గ రమణుండు భరతుండు
కాళికాంబ! హంస! కాళికాంబ!

408. మౌనులైన యతులలో నెవ్వరైనను
సోమయాజులైన శూరులైన
ఆడువారి తల్లులని చూడగావలె
కాళికాంబ! హంస! కాళికాంబ!

409. అనకయున్న నేమి యనియేరు పెద్దలు
అంకు నెత్తిగొట్టి రాలు వేయు
వేసి వెతలుగొలిపి మోసమ్ము చేయురా!
కాళికాంబ! హంస! కాళికాంబ!

410. పెద్దవారికెల్ల బుద్ధిక్రమం బిది
పిన్నవారికెల్ల పేరులేదు
పిన్న పెద్దక్రమము పేరు లెట్టుల యుండు
కాళికాంబ! హంస! కాళికాంబ!

411. మోహపాశములను మొదటనే పెనుబాము
క్రియలు రద్దుపఱుప క్రింది వేఱు
అందమైన జ్యోతి అతడౌట వితగాదు
కాళికాంబ! హంస! కాళికాంబ!

412. పాతికెకును గొన్న భక్తిముక్తులు లేవు
పాతికెకును గొన్న పలువ లంజె
లంజెపక్కపండె లలి నాల్గుపాతికెల్
కాళికాంబ! హంస! కాళికాంబ!

413. నాల్గుపాతికెలకు నాణ్యంబు చెడిపోయె
పాతికెకునుగూడ భ్రష్ట మాయె
భ్రష్టులైనవారి ఫలమంత పోయెరా!
కాళికాంబ! హంస! కాళికాంబ!

414. కాయమనెడి విల్లు కదలకుండగ బట్టి
బుద్ధియనెడి నారి పొరలకుండ
మన సనేటి యంబు మఱి గుఱి చేయరా!
కాళికాంబ! హంస! కాళికాంబ!

415. మనసు బుద్ధులకును మరసీల గొన్నట్లు
గురుని పాదచింత గూడదాయె
ఎఱుకయనెడి సుత్తె నెగురగొట్టగవలె
కాళికాంబ! హంస! కాళికాంబ!

416. తెలివిలేనిసీల బలమైన దగుటచే
సుత్తెచేత లెస్స మొత్తవలయు
సీల తెగిన వెనుక [1]సిస్తుగా బలుకునో
కాళికాంబ! హంస! కాళికాంబ!

417. కల్లగురుడు కట్టు కల్లకర్మంబుల
మధ్యగురుడు కట్టు మంత్రములను
ఉత్తముండు కట్టు సత్తు చిత్తుల రెండు
కాళికాంబ! హంస! కాళికాంబ!

418. పైని త్రచ్చగాను ప్రకృతిరూపము వెల్గు
చీకటంత విరియు లోకులకును
తరువతరువ నమృతధారలు చిమ్మురా!
కాళికాంబ! హంస! కాళికాంబ!

1. సిస్తు = అందము, సొంపు

419. ప్రకృతి విడగగొట్టి పట్టి విఱిచినప్డు
వికృతి యనుగుణమ్ము విఱుగబోదు
ప్రకృతిపుటమునుంచి వికృతిని గనవలె
కాళికాంబ! హంస! కాళికాంబ!

420. మేళ మెంతొ చేసి మెప్పులు గనెనయా
మేళజతలు పదియు మెఱపు నొకటి
పదినిమించి యెంచ బ్రహ్మంబు లేదయా
కాళికాంబ! హంస! కాళికాంబ!

421. మాయ గుంపుచేసి మఱి తెరువాటులై
యున్నవాని కడకు నున్నవాని
కన్నవారు మోక్షఘనులైరి మునులైరి
కాళికాంబ! హంస! కాళికాంబ!

422. నిన్ను జూతునన్న తన్ను దా గనలేడు
తన్ను జూతునన్న నిన్నుగనడు
నిన్ను గన్నయపుడె సున్నయౌ నన్నియు
కాళికాంబ! హంస! కాళికాంబ!

423. మాయలంజె యొకటి మర్మంబు గననీదు
పంచనున్నలంజె ప్రక్కజేరి
అల్ల రెంతొ చేయ నిల్లంత చెడిపోయె
కాళికాంబ! హంస! కాళికాంబ!

424. [1]ఇద్ద రంటకుండ హద్దుగా తిరుగాడు
వాడె గొప్పవాడు వసుధలోన
సర్వసిద్ధుడౌను సర్వంబు తానౌను
కాళికాంబ! హంస! కాళికాంబ!

1. ఇద్దరు = పాపపుణ్యములు

425. బుద్ధి పరుషుడాయె, పొలుపారు మోహంబు
ఆడుదాయె, నెల్ల ప్రాణులకును;
సృష్టిలోన నిదియె చిత్రాతిచిత్రంబు
కాళికాంబ! హంస! కాళికాంబ!

426. మంచికన్నులైతె మాయ జూచినవేళ
చలన భావ మేల కలుగు జగతి?
మంచికన్నులైతె మాలిన్యమే లేదు;
కాళికాంబ! హంస! కాళికాంబ!

427. ఎట్లు [1]నిస్సరణమొ? ఏమొకో మహిమమ్ము?
శివుని మాయ యేమొ? చెప్పరాదు
అనుచు బ్రహ్మవిదులు కనుగొని రాజ్యోతి
కాళికాంబ! హంస! కాళికాంబ!

428. ఎంత లెక్క వేయ నేమి కాంచగలారు
పన్ని యన్నికంటె ప్రబలువారు
ప్రబలుట యిదిగాదు పన్నిద మ్మిదిగాదు
కాళికాంబ! హంస! కాళికాంబ!

429. మాట తెరకు నెక్కు మరుగు పెట్టుట చెప్పె
నొండు తిరముచేసి రెండు పెట్టి
మూడు భాగహారముం జేయ సున్నయౌ
కాళికాంబ! హంస! కాళికాంబ!

430. అయినలెక్కనంత నావల బెట్టుచు
రెండు తిరముచేయ మూండు పెట్టి
అయిదుతోడ భాగహారింప నొకటాయె
కాళికాంబ! హంస! కాళికాంబ!

---

1. నిస్సరణము = ముక్తి

431. లెక్క యొకటి నిలిచె రేచింప పూరింప
రానుపోను విశ్వరాము డాయె
చిక్కుదీరిపోవ లెక్క యొక్కటి యాయె
కాళికాంబ! హంస! కాళికాంబ!

432. ఒక్కటొక్కటి తెర పెక్కం(డ్రు గలవయా
ఒక్కమనసుతోడ నిక్కకుండ
త్రొక్కిపట్టు సరికి చిక్కును బ్రహ్మంబు
కాళికాంబ! హంస! కాళికాంబ!

433. ప్రజ్ఞయనెడి గురుడు పంచనే యున్నాడు
సూక్ష్మదృష్టితోడ జూడవచ్చు
అజ్ఞులైనవార లంధులై పోదురు
కాళికాంబ! హంస! కాళికాంబ!

434. తనకు దారి తెలుప తనవెంట గురుడుండ
కల్లగురులపైన కాంక్షలేల?
కల్లసత్యములకు నెల్ల గురుం డుండె
కాళికాంబ! హంస! కాళికాంబ!

435. అడవిలోన గురుడు పడి యాకటంబడి
అడవినెల్ల తినెదమంచు జూడ
[1]పరికె గచ్చపొదలు బలిసియున్నవికదా!
కాళికాంబ! హంస! కాళికాంబ!

436. గుడ్డివానిపైన కుంటివా డున్నాడు
దొడ్డవారి కెల్ల త్రోవ జూప
కుంటివాని గుణము గుర్తించి బ్రతుకరో
కాళికాంబ! హంస! కాళికాంబ!

1. పరికె = శృంగాటకము. (నాల్గుదారులు కలియుచోటు = చౌరస్తా)

437. జీవిలేక పైన చెచ్చెర తిరుగాడు
జీవిలేక నీట చిందులేయు
జీవిభూతములకు శృంగారభూమిరా!
కాళికాంబ! హంస! కాళికాంబ!

438. మనసుకంటె లొచ్చు మఱి దశేంద్రియములు
మనసులొచ్చు బుద్ధిమాన్యతకును
చెలగుబుద్ధి లొచ్చు జీవాత్మకంటెను
కాళికాంబ! హంస! కాళికాంబ!

439. తొట్టిగుడిసెలోన [1]తుఱగలి గలరీతి
పట్టిగుడిసెలోన ప్రబల మాయె
వెట్టినరులు గనుక వెదక నూహింపరు
కాళికాంబ! హంస! కాళికాంబ!

440. కిటికినుండి సూర్యకిరణమ్ము గనురీతి
ఆత్మలోన మోక్ష మరయవలయు
ఆత్మయనెడి కిటికి కవియెన్ని మూతలో
కాళికాంబ! హంస! కాళికాంబ!

441. చేతు లెత్తి పట్టి మూతలు గడెదీసి
ముక్తి పథము చేరబోవు నంత
కావలున్నముగురు కకవిక లవుదురు
కాళికాంబ! హంస! కాళికాంబ!

---

438. ఇంద్రియేభ్యః పరంమనో
మనస్సత్వ ముత్తమం
సత్వా దధికో మహా నాత్మా
మహతోZ వ్యక్త ముత్తమమ్ (కఠోపనిషత్-2-6-7)

1. తుఱగలి = వెలుతురు

442. మోక్షదాతలైన ముగ్గురు దయచేయ
నాత్మలోన మోక్ష మంటుకొనును
వారి హుకుముతోడ వైకుంఠవాసియౌ
కాళికాంబ! హంస! కాళికాంబ!

443. ఘనుల దొరలహుకుము గలిగి యున్నదిగాన
కావలున్న ముగురు కడకు దొలగి
బాటచూపగలరు వైకుంఠ మిదియని
కాళికాంబ! హంస! కాళికాంబ!

444. ద్వారమందు దొడ్డవార లుందురుగాన
చేరుటకును వలయు వారి హుకుము
గుఱు తెఱించి వారు తెరువు లిత్తురుగదా!
కాళికాంబ! హంస! కాళికాంబ!

445. వింతచింత అంత సంతకాయగ జూడు
సంతకాయ యొక్క సగముచూడు
సగముసంతకాయ సర్వంబ యనిచూడు
కాళికాంబ! హంస! కాళికాంబ!

446. [1]విషపు సూకరమును విదళించి కొట్టగా
విష మదెవరికైన విదలగొట్టు
విషముగొట్ట పెక్కువింతలు పుట్టురా!
కాళికాంబ! హంస! కాళికాంబ!

447. మానినులను తల్లిగా నాత్మనెంచిన
సందియమ్ము లెల్ల సమసిపోవు
సమసిపోవ తాను సర్వేశ్వరుం డౌను
కాళికాంబ! హంస! కాళికాంబ!

---

1. విషము = జలము

448. తనకు తల్లి నిజము తప్పక చూచిన
తనకు తాను బ్రహ్మ తారకంబు
బ్రహ్మసూత్ర మద్ది బ్రహ్మమ్మ యదియౌను
కాళికాంబ! హంస! కాళికాంబ!

449. విద్యలెల్ల నీవ వెలదు లెల్లరు నీవ
నిఖిలవిశ్వమందు నిండియుంటి
శ్రుతుల, స్మృతుల మించు నుతిపాత్ర మౌదువు
కాళికాంబ! హంస! కాళికాంబ!

450. తఱచుమాటలేల తత్తుల్య మే కాని
యిరుగు పొరుగు మాట లరయ నేల?
పరమయోగియైన పలుమాట లవియేల?
కాళికాంబ! హంస! కాళికాంబ!

451. [1]భావనమ్ము చూడ పరశివసూత్రమ్ము
గోవునకును వలదు కొట్టుతిట్టు
భావమందు నీవు బ్రహ్మమ్ము చూడరా!
కాళికాంబ! హంస! కాళికాంబ!

452. పరమయోగియైతె బ్రహ్మమ్ము బ్రహ్మమ్ము
పరమయోగియైతె పలువ పలువ
పరమశివుడుగాగ భావన భావన
కాళికాంబ! హంస! కాళికాంబ!

---

449. విద్యాః సమస్తాః తవ దేవి! భేదాః
స్త్రియః సమస్తాః సకలాజగత్సు
త్వయైకయా పూరిత మంబ యైతత్
కాతేతిస్తుః స్తవ్య పరాపరోక్తిః (దేవీ మహాత్మ్యము)

1. భావనము = తలపు

453. బ్రహ్మమందు నీద పరులకు కష్టమ్ము
బ్రహ్మమందు నీదు పరమయోగి
బ్రహ్మ తెప్పచేసి ప్రకృతిలో నీదరా!
కాళికాంబ! హంస! కాళికాంబ!

454. తెప్పమాత్ర తెలిసి తేలి యీదగవలె
ఈతమాత్ర తెలిసి ఈదవలెను
లోతు పాతు తెలిసి లోకంబు గనవలె
కాళికాంబ! హంస! కాళికాంబ!

455. ఆత్మ సింధు వందు నది యీదరాదయా
బయలు సంద్రమందు బారయీది
లోనిసాగరమ్ములో యము డున్నాడు
కాళికాంబ! హంస! కాళికాంబ!

456. కాలయముని యాట కట్టించబోయిన
కాలయముడు తోలితోలి కొట్టు
కాలయముని గళము ఖండించురా కాళి
కాళికాంబ! హంస! కాళికాంబ!

457. పంచశతమముకోటి బ్రహ్మంబు లుండగా
నెంచ శక్యమగునె యెవరికైన?
కొంచెమైన కుక్షికోటలో శివు డుండు
కాళికాంబ! హంస! కాళికాంబ!

458. అందఱందు శంభు డానందమైనాడు
కొందఱందు నుండి యందనట్లు
కాంచ వారివీరి కర్మబంధ మదేమొ?
కాళికాంబ! హంస! కాళికాంబ!

459. నీచమైన కోట్ల యోచన లెందుండు
యోచనలను దృష్టి యొప్పుచుండు
సృష్టిజాణలోన చిక్కి నక్కినదయా!
కాళికాంబ! హంస! కాళికాంబ!

460. కన్నులకును పొరలు కడకు వీడితెగదా
జ్ఞానమనెడి జ్యోతి కానవచ్చు
కన్నులకును మాయ గప్పి [1]మబ్బున వేసె
కాళికాంబ! హంస! కాళికాంబ!

461. అప్పటికిని బుట్టె నది చెప్పగా వద్దు;
తిరిగి మరలరాగ తెలియవలదె?
అదియు తెలియువాడె ఆనంద బ్రహ్మంబు
కాళికాంబ! హంస! కాళికాంబ!

462. భద్రమైన బాహుబలము సద్గురు కుండె
పరమభద్రమైన భావ ముండె
భద్ర మొసగునట్టి బ్రహ్మమే గురువురా!
కాళికాంబ! హంస! కాళికాంబ!

463. పగలు రాత్రి నాల్గు పదవు లందగవచ్చు
గురువు శిష్యు డనెడి గుఱుతె యుంటె;
గుణమువంక పోతె గుడ్డెద్దు చందమౌ
కాళికాంబ! హంస! కాళికాంబ!

464. మంచిచెడ్డలెల్ల మది బొంగరము చేసి
కుడియెడమల వేయు గురువరుండు
ఆత్మబొంగరముల నాడింప నేర్చురా!
కాళికాంబ! హంస! కాళికాంబ!

1. మబ్బు = చీకటి (కడప మాండలికము)

465. ప్రకృతి యోచనముల, బైరాగివేషాల
పూజచేయ నేమి పుణ్యమబ్బు?
ప్రకృతి దీసివేయ ఫలమబ్బు ముబ్బడి
కాళికాంబ! హంస! కాళికాంబ!

466. ప్రకృతి గురువు పూజ పట్టనేరాదయా
ప్రకృతి మ్రింగు గురుని పాదపూజ
పాదపూజ బ్రహ్మభావన నిక్కమ్ము
కాళికాంబ! హంస! కాళికాంబ!

467. ప్రకృతినంత తీసి పట్టి ముల్లెగ గట్టి
పెట్టెలోన బెట్టు పెద్ద లరుదు
వేమనంత పెద్ద వెదకి పట్ట గలాడు
కాళికాంబ! హంస! కాళికాంబ!

468. కూటికొఱకు నరులు గూపెట్టి చత్తురు
కూటికొఱకు జనము కుదురు పడును
కూడులేకయున్న గురుడు శిష్యుడు లేడు
కాళికాంబ! హంస! కాళికాంబ!

469. దారినడచునట్టి వారి కెల్లరకును
హక్కులొకటె యనుచు ఋుక్కు పలికె;
హెచ్చుతగ్గు లెట్లువచ్చెనో తెలియదు
కాళికాంబ! హంస! కాళికాంబ!

470. మనసులోన సుంత మలినమ్ము పుట్టెనా
మనసులోని ప్రభువు మాయకాడు
అజ్ఞు దరుగుదెంచ నటు పడి యురుకురా!
కాళికాంబ! హంస! కాళికాంబ!

---

469. సమానో అధ్వా ప్రపతా మనుష్యదే. (ఋగ్వేదము -2-13-12)

471. మనసు నిర్మలమగు మనసు తా గనుగొన్న
మనసులోన నున్న మాయ గనిన
మనసె జ్యోతి; మనసె మార్గమ్ము ముక్తికి
కాళికాంబ! హంస! కాళికాంబ!

472. మనసునకును గురునకును మహావైరమ్ము
అవునొ కాదొ పెద్ద నడిగి చూడు
నేర్చు పెద్దలైతె నిగ్గదీతురు దీని
కాళికాంబ! హంస! కాళికాంబ!

473. వెఱ్ఱివానికైన వేయిపర్వులనేల
వెదకవచ్చు - మనసు వెదుకలేడు
మనసు నిలిపివేయ మాయ పోగొట్టదా!
కాళికాంబ! హంస! కాళికాంబ!

474. మనసుకంటె వేఱె మహిబంబు లేదయా
మనసు కొక్కటిగుఱి మాయకాడు
మాయకానిలోని మర్మంబు గనవలె
కాళికాంబ! హంస! కాళికాంబ!

475. మనసు శుద్ధమైతే మఱి దండమేటికి?
మనసు శుద్ధమైతె మంచిదనుట
మంచిచెడ్డ లెల్ల మానసంబేకద!
కాళికాంబ! హంస! కాళికాంబ!

476. మానసమ్ము దొడ్డ మఱి యెవ్వరికినైన
సుఖము దుఃఖములకు సూత్రధారి
సూత్రమర్మ మెఱుగ సుఖదుఃఖములు లేవు
కాళికాంబ! హంస! కాళికాంబ!

477. మనసు లొంగదీయ మఱి మూడుగలవయా
చూపు, రూపు కోర్కె – చుట్టిపట్టి
మట్టుచేయ ధాన్యమర్యాదగా నుండు
కాళికాంబ! హంస! కాళికాంబ!

478. ఆత్మతత్త్వమున మహావాక్యములు నాల్గు
వివరణ మ్మొనర్ప వినిన కనిన
వాడె హరియు హరుడు పరమేష్ఠిగా మాఱు
కాళికాంబ! హంస! కాళికాంబ!

479. మూటిపైన జూడ మున్నూరు కోట్లకు
శత్రుపంపు లుండు చంప నెపుడు
అదిగొ పంపువచ్చె నరసి ఖండింపుము
కాళికాంబ! హంస! కాళికాంబ!

480. భావభావమందు పంపు చప్పున వచ్చు
పంపు త్రెంచివేయ భావ మమరు
భావమనగ బ్రహ్మభావమ్ముగద చూడ
కాళికాంబ! హంస! కాళికాంబ!

481. పంపు చొరవకుండ పరిహరించును యోగి
కొంప చెఱుపకుండ పంపుపోవు
అంకు సున్నయైతె రఘురాము డున్నాడు
కాళికాంబ! హంస! కాళికాంబ!

482. ఎఱుకయైన పంపు నేర్పడ మెడబట్టి
కోడి జాతరందు కొట్టినట్లు
గురుని చూపు నిలిపి కొట్టు బ్రహ్మజ్ఞాని
కాళికాంబ! హంస! కాళికాంబ!

483. హొత్తు ఛీలు పంపు నవగ వేయును భోగి
చిచ్చి ఛీయనంగ చేరకుండు
మీసమింత మెలిపి మీటగొట్టునుయోగి
కాళికాంబ! హంస! కాళికాంబ!

484. చిచ్చి ఛీయటన్న చిత్తు దేవతయగు
చొచ్చొ చోయటన్న చొచ్చు గీము
మండపమును జేర కుండలి రేగురా!
కాళికాంబ! హంస! కాళికాంబ!

485. చిత్తు దేవ తెట్లు చీయన నేర్చును
అంజనమ్ము చిక్కు నతడె యనును
చిక్కినట్టివారి చిన్నె లికేలరా!
కాళికాంబ! హంస! కాళికాంబ!

486. సర్వదేవతలను సర్వమతాలను
సమముగా నెఱుంగు సజ్జనుండు
దుర్జనుండు లాతి దోషమ్ములను నెంచు
కాళికాంబ! హంస! కాళికాంబ!

487. జిహ్వా పృథివిగుణము చిక్కెఱుంగగ నీదు
పుడమి ఎంత పూరి పుట్టుచుండు
పూరి పుట్టురీతి బుద్ధులు పుట్టురా!
కాళికాంబ! హంస! కాళికాంబ!

488. చిక్కు చెక్కునతడు జీవు డెన్నగ త్వష్ట
భావమెంచిచూడ బ్రహ్మ మతడు
వాని పే రదేమి? వాడె పరశివుండు
కాళికాంబ! హంస! కాళికాంబ!

489. అట్టి శివుని పాదమంటి కొల్చినవారు
భోగభాగ్యములను పొందగలరు
కానినాడు వాడు [1]గాలి మేయగవలె
కాళికాంబ! హంస! కాళికాంబ!

490. హరిహరులకు పూజ లాచరించెడు వేళ
జ్ఞానహీను డొడలు దాన మిచ్చె
పొమ్మటన్న దెఱిగి పోగొట్టవలె నొడల్
కాళికాంబ! హంస! కాళికాంబ!

491. ఇట్టి దివ్యభవన మిందేరు వత్తురు
దాత లెఱుకవాండ్రు తత్వగాండ్రు
శివుని ముట్టకుండ చిందొందగొట్టరో
కాళికాంబ! హంస! కాళికాంబ!

492. గళమునందు నిలువ గాయత్రిమంత్రంబు
బడవమాంత్రికులతొ గొడవ యేల?
సూత్రధారి ముక్తి చూపగా నోపడు
కాళికాంబ! హంస! కాళికాంబ!

493. గుదమునందు క్రింద కుండలి యుండగా
మెడను నూలుపోగు లిడగ నేల?
వేచి యూర్ధ్వముఖము రేచింపవలె సుమా!
కాళికాంబ! హంస! కాళికాంబ!

494. రెంటిలోన పొరలి రేచింపవలెనయా
రేచిరేచి నించి లేపవలెను
లేపి గురునిపాదరేణువు గనిరయా!
కాళికాంబ! హంస! కాళికాంబ!

---

1. గాలి మేయగవలె = నింద ననుభవించవలె.

495. ఉత్తమోత్తమమ్ము లుచ్ఛ్వాస నిశ్వాస
పంక్తు లరసి తాను బ్రహ్మ మగుట
ముసుగులోన శివుడు పొసగియున్నాడయా
కాళికాంబ! హంస! కాళికాంబ!

496. పట్టుదోవతులును పై పచ్చడంబులు
ఎక్కువైన సొమ్ము లెందుకొఱకు?
చక్కదనముతోడ చావు తప్పక యుండు
కాళికాంబ! హంస! కాళికాంబ!

497. ఎఱ్ఱబట్ట గట్ట తొఱ్ఱిమాటుల నాడె
పట్టెయోగిగాని పదవి గాదు
తెల్ల పచ్చ యెఱ్ఱ నల్లరంగు లొకండె
కాళికాంబ! హంస! కాళికాంబ!

498. బూతి పూసెనేని పుట్టువు చెడవలె
మట్టుచేయు భూతి మాయభూతి
భూతి పూసెనేని పుట్టిగిట్టు టుళక్కి
కాళికాంబ! హంస! కాళికాంబ!

499. పట్టెవర్ధనములు బాగుగా ధరియించి
పాపజాతి మనసు పట్టలేదు
మనసు బిగ్గబట్టి మహిమ గన్గొనుమయా
కాళికాంబ! హంస! కాళికాంబ!

500. పరమభాష్యకార భక్తుల కీభూమి
నిహము పరము రెండు నీయవలెను;
ఈవు లంది భక్తు లిటనట తరియింత్రు
కాళికాంబ! హంస! కాళికాంబ!

501. పరమభాష్యకార భక్తుడైతే భువి
హరిహరులకు పూజ లతడు నేర్పు
ముక్తి కర్తయైతె మోక్షంబు నిచ్చురా
కాళికాంబ! హంస! కాళికాంబ!

502. పట్టుపట్టి చూడ వైకుంఠ కైలాస
ములను లేవు తీర్థములను లేవు
భక్తజనుల హృదయపద్మాల నుందువు
కాళికాంబ! హంస! కాళికాంబ!

503. శరణు శరణటంచు కరములు జోడించు
దీనజనుల కెల్ల దిక్కు నీవె
పారమర్థికముగ నారాయణిని నీవె
కాళికాంబ! హంస! కాళికాంబ!

504. సప్తకోటి మంత్ర సాధకు లెవరయా
సప్తకోటిమంత్ర సంజ్ఞ లెఱుగ
సప్తకోటిమంత్రసంజ్ఞ లొక్కటె సుమా!
కాళికాంబ! హంస! కాళికాంబ!

---

501. నాహం తీర్థే న కైలాసే
వైకుంఠే వా న కర్హిచిత్
వసామి కింతు మత్ జ్ఞాని
హృదయాంభోజ మధ్యమే. (దేవీగత)

503. శరణాగతదీనార్త
పరిత్రాణపరాయణే
సర్వస్యార్తిహరేదేవి!
నారాయణి నమోస్తుతే (మార్కండేయపురాణము)

505. మంత్రతంత్రములకు మాతృకామూర్తివి
పదములకును జ్ఞానపథము నీవు
శూన్యజాలమునకు శూన్యసాక్షిణి నీవు
కాళికాంబ! హంస! కాళికాంబ!

506. కడుపు హెూమగుండక్రమ మౌట తెలియరో
క్రమము దెలియకున్న కష్టమగును;
కడుపులోన చిచ్చు కార్చిచ్చు పైపెచ్చు
కాళికాంబ! హంస! కాళికాంబ!

507. కారుచిచ్చుకింత క్రమముతో వేయుము
క్రమము తప్పెనేని కళలు లేవు
కళలె యీశుడౌట కార్చిచ్చునకు భుక్తి
కాళికాంబ! హంస! కాళికాంబ!

508. చిచ్చు కెవడు భుక్తి సీమలో బెట్టిన
చచ్చె నొచ్చె నవడు సాధకుండు
హెచ్చుకొలువులోన నుచ్చస్థితిగ నుండు
కాళికాంబ! హంస! కాళికాంబ!

509. హెూమగుండమం దహెూ! మంత్రముల్ చెప్పి
పూజచేయ నేమి పుణ్యమబ్బు?
హెూమగుండ మున్న భూమి కానగవలె
కాళికాంబ! హంస! కాళికాంబ!

---

505. మంత్రాణాం మాతృకా దేవీ
శబ్దానాం జ్ఞానరూపిణే
జ్ఞానానాం చిన్మయాతీతా
శూన్యానాం శూన్యసాక్షిణే! (దేవీగీత)

510. అష్టదిలనున్న ఆగుండమే గాని
యిష్టమైన గుండ మెఱుగలేరు
కష్టమైనలోని కార్చిచ్చు గనవలె
కాళికాంబ! హంస! కాళికాంబ!

511. సత్యసంధులకును సంతోష మొసగును
శిష్టలోకమునకు నిష్టము లిడు
రాజపూజితవు సరస్వతి వీవె కా
కాళికాంబ! హంస! కాళికాంబ!

512. సర్వశుభము లీయ శాంకరి వౌదువు
భవ్యవాక్కులీయ వాణి వీవ
కోరుకుల నొసంగు నారాయణివి నీవ
కాళికాంబ! హంస! కాళికాంబ!

513. పరమశివుడుగూడ గురురూపిణిగ నిన్ను
త్రిపురసుందరిగను హృదిని భక్తి
దలచి కొలిచె ననియె లలితా సహస్రమ్ము
కాళికాంబ! హంస! కాళికాంబ!

514. వేదభాగమం దుషాదేవి సంస్తుతుల్
కొల్లలుగనుజేసి కొలిచి మునులు
యాగభాగముల సహాయమ్ము లందిరి
కాళికాంబ! హంస! కాళికాంబ!

---

511. చోదయిత్రీ సూనృతానాం
చేతంతీ సుమతీనాం
యజ్ఞం దదే సరస్వతీ. (ఋగ్వేదము 1-3-11)

515. యుగయుగాంతమందు నగపడకుండిన
నాల్గువేదములను నలువ యాన
మునులు పూర్వకాలమున వ్రాసిపెట్టిరి
కాళికాంబ! హంస! కాళికాంబ!

516. కాలసర్పమనెడి కార్చిచ్చు చెలరేగి
నిక్కనీని బుద్ధి నిలువకుండె
చక్కనైన బుద్ధి [1]సాయుజ్య మిచ్చురా
కాళికాంబ! హంస! కాళికాంబ!

517. గుండగొయ్యయైన కుమలక కుమలక
దండియేడ్పులేడ్చు మెండుగాను
దండె చాపి తెలిపె చండాలకన్యక
కాళికాంబ! హంస! కాళికాంబ!

518. అంకులాడి బొంకు రాదెల్ప శక్యమా?
కుంకముండయైన కుమిలి తెలుపు
కుంకఅంకులాడి కూర్చును శివుడయా
కాళికాంబ! హంస! కాళికాంబ!

519. పతియె వ్రతముగలది పరమార్థముగ నుండు
బండముండ యుండు ప్రౌఢిగాను
బండముండదాని పతివ్రత యందురా?
కాళికాంబ! హంస! కాళికాంబ!

---

515. యుగాంతే తర్హితాన్ వేదాన్
సేతిహాసాన్ మహర్షయః
రేఖిరే తపసా పూర్వ
మనుజ్ఞాతా స్వయంభువా. (తైత్తిరీయసంహిత 1-1-1)

1. సాయుజ్యము = సహ యోగము (పరబ్రహముతో లీనమయ్యెడిపదవి)

520. పరమపతివ్రతకును పతి అంకు వేసెనా
[1]గుండతొత్తుగాదు కుమిలి యేడ్వ
పరమసాధ్వియైన పరశివు నంటురా
కాళికాంబ! హంస! కాళికాంబ!

521. ఎందునైన నొకటె యెద్దైన నొక్కటే
బుద్ధిగలిగియుండ పొడము దేహి
తరిమి పొడువవచ్చు తాడుతెంపులమారి
కాళికాంబ! హంస! కాళికాంబ!

522. అర్చకుండు ద్వారమందునే యున్నాడు
దేవునింత గనక దేవులాడి
వాగివాగి వాడు వాగునబడి చచ్చె
కాళికాంబ! హంస! కాళికాంబ!

523. అర్చకుండు మివుల చర్చించి "నీవార
శూకవత్తు" వెల్గు చూడ నేర్చు
దేవతార్చకుండు దేవుని కనుగొను
కాళికాంబ! హంస! కాళికాంబ!

524. శివుడు లేనిచోట శివయుండ నేరదు
శివము లేనిచోట శివుడు లేడు
శంకరుండు శివయు చంద్రచంద్రిక లట్లు
కాళికాంబ! హంస! కాళికాంబ!

---

1. గుండతొత్తు = గుడ్డకైవచ్చిన లంజె, గుండ=గుడ్డ

524. న శివేన వినా దేవీ దేవ్యాచ న వినా శివః
నైతయో రంతరం నాస్తి చంద్రచంద్రికయో రివ.
(కామకలావిలాసము)

525. ఋషులు పల్కె "రేవ మేషాపరాశక్తి"
యనుచు సృష్టిచేసి రంబ యంచు
ఈశ్వరేచ్ఛ ననుసరించి యీశ్వరి యుండు
కాళికాంబ! హంస! కాళికాంబ!

526. సమయ మెట్టు లగునొ యముడు ధర్మ మెఱుంగు
నేల యిట్టు లగుట యెవరి కెఱుక
సర్వవిషయములను స్వామికి దెలియవా?
కాళికాంబ! హంస! కాళికాంబ!

527. ఆశపాశములకు కూసమ్ము దొడుగక
కాశిపోదునన్న కలదె ముక్తి?
ముక్తి దూరమంచు మొఱలిడ వినలేదొ!
కాళికాంబ! హంస! కాళికాంబ!

528. కూపజలములందు కూర యేరినరీతి
బియ్య మెంతొ కడిగి పెట్టినటుల
చాకి చీరముఱికి చంపిన విధమయా!
కాళికాంబ! హంస! కాళికాంబ!

529. కూపమందు ముఱికి గూల్చి తీర్థము దెచ్చి
కడిగి పడియవేసి కాలవైచి
మేలితీర్థమంచు గ్రోలుటయే ముక్తి
కాళికాంబ! హంస! కాళికాంబ!

530. ఉత్తమంబు తీర్థ మొదలందె యున్నది
మధ్యమంబు గలదు మనసునందు
మంచితీర్థమెల్ల మనలోన నున్నది
కాళికాంబ! హంస! కాళికాంబ!

---

525. ఏవ మేషా పరాశక్తిః ఈశ్వరేచ్ఛానువర్తినీ
స్థిరం చరంచ యద్విశ్వం సృజతీతి వినిశ్చయః (దేగీత)

531. తీర్థయాత్రలందు దేవు డొక్కడెగదా
మంచి తీర్థంబు మన పంచనుండె
దివ్య తీర్థ మిదిగొ దేహమం దున్నది
కాళికాంబ! హంస! కాళికాంబ!

532. యాత్రలెల్ల వెదక నాత్మలో నుండగా
యాత్ర దిరుగువార లథము లెన్న
యాత్ర కాత్మ సాక్షి యందులో శివకాశి
కాళికాంబ! హంస! కాళికాంబ!

533. పర్వతంబు చూడ పదియునై దామడ
పరుగులెత్తిపోవు పలువయోగి
యోగి నిజమయైతె యొద్ద పర్వత ముండె
కాళికాంబ! హంస! కాళికాంబ!

534. అయిదుగాండ్ల రథము నధికుడౌ నొకరుండు
అయిదుకోటలందు నమరియుండు
బండి విఱిగిపోయె పరమేశు డున్నాడు
కాళికాంబ! హంస! కాళికాంబ!

535. బండి పరమశివుడు పట్టియుండెడి చోటు
కొంటెకాండ్ర బట్టె కొట్టవలద
పరమశివునితోడ బండి పరంజ్యోతి
కాళికాంబ! హంస! కాళికాంబ!

536. పట్టణ మ్మొకండు పల్లెలు పండ్రెండు
కొల్లగాండ్రు ధనముగొట్టువారు
కొట్టుతిట్టువారు గుట్టుగా మ్మట్టెరి
కాళికాంబ! హంస! కాళికాంబ!

537. చాలగలదు హింస సంసారమందున
పసిడియందు హింస ప్రబలియుండు
హింస చేతునన్న నిక ముక్తి లేదయా!
కాళికాంబ! హంస! కాళికాంబ!

538. మాయయందు మణగి మమత దీసెదనన్న
కామ, క్రోధములను ఘనత కెక్కె
ఘనత కెక్కువారు ఘనులైరి కొందఱు
కాళికాంబ! హంస! కాళికాంబ!

539. మొండిబండలైన గండభేరుండాల
గ్రద్ద లెగురదన్ను కాలమాయె
తన్నవచ్చు గాని తనుదాసు జచ్చును
కాళికాంబ! హంస! కాళికాంబ!

540. ముల్లుగఱ్ఱ కెపుడు ముల్లు ప్రాణంబగు
కడమజీవులకును కత్తి మొనయు
కలము, గలంట మెన్న కరణాల ప్రాణమ్ము
కాళికాంబ! హంస! కాళికాంబ!

541. కరణ మొక్కరుండు కను విశ్వమెల్లను
కానలేడు వాడు కడమవ్రాలు
కడకు వ్రాయువ్రాత కనుగొని బ్రతుకుడీ
కాళికాంబ! హంస! కాళికాంబ!

542. పంచభూతవికృతి భ్రాంతుల బోకుడు
పొంచి పొంచి పంచభూతములను
వంచనమున వాని వంచ ముక్తియు లేదు
కాళికాంబ! హంస! కాళికాంబ!

543. పంచభూతివికృతి భ్రాంతి నుంచితె మించి
పంచభూతివికృతి భ్రష్టులైరి
పంచభూతవికృతి భ్రమలె బ్రహ్మంబురా!
కాళికాంబ! హంస! కాళికాంబ!

544. వింటిరే మహాత్మ! యింటిలో నొక్కండు
తొంటి ముండకొడుకు దోసకారి
కాము డనెడివాడు కడతేఱ నీయడో
కాళికాంబ! హంస! కాళికాంబ!

545. వాని కింక నొకడు వచ్చెనా సైదోడు
క్రోధ మనెడువాడు కొంటెకుక్క
కుక్కలకునుబుద్ధి కొట్టిన వచ్చునా?
కాళికాంబ! హంస! కాళికాంబ!

546. ఇద్దరకును జతగ నింకొక్క డున్నాడు
లోభిముండకొడుకు లోకమందు
ధరణి వీరినడత లెఱుగుదు రార్యులు
కాళికాంబ! హంస! కాళికాంబ!

547. ముగ్గురేకమగుచు మొఱపెట్టుకొన్నారు
మోహమెనడి వాడు మొదటి రాజు
కొల్లబోవు నూరు కొట్టుకో మన్నాడు
కాళికాంబ! హంస! కాళికాంబ!

548. ఊరు కొల్లబోవు నుపమ చెప్పుమటన్న
మదము నేనుగ యనె మావటీడు
హంకరించు ధర్మమటు [1]తుర్లగొట్టునో
కాళికాంబ! హంస! కాళికాంబ!

1. తుర్లగొట్టు = తోలు

549. తుర్లగొట్టువాడు తులువకత్తియెకదా
[1]తుట్టుగొట్టువాని తోడొకండు
మత్సరమనె ముచ్చు మాయనాయకు డుండు
కాళికాంబ! హంస! కాళికాంబ!

550. ఆత్మసీమనేల నార్గురు రాజులు
మదము, క్రోధ, లోభ, మత్సరమలు
కామ, మోహములను ఘనులు దుర్జయులయా
కాళికాంబ! హంస! కాళికాంబ!

551. ఎఱుగనట్టివార లెఱుగనే యెఱుగరు
ఎఱిగియున్నవార లెఱుకవారు
ఎఱిగి మర్మ మరసి రెంతెంతవారలో
కాళికాంబ! హంస! కాళికాంబ!

552. చీకు లేక చూడు వైకుంఠశిఖరాన
ముగ్గు రీతకాండ్రు మూట నిలిచి
వచ్చినట్టివారి భంగ మొనర్తురు
కాళికాంబ! హంస! కాళికాంబ!

553. అయ్య! యింక నెట్టు లంతటింతట గూడి
మెల్లమెల్ల కుదురు మేల్కిచేసి
తిన్నగాను ముగరు దిగనాడ్చురా! యోగి
కాళికాంబ! హంస! కాళికాంబ!

554. ముగురి హుకుములైతె మూలలింగానకు
పూజచేయ భుక్తి ముక్తి గలుగు
హరిహుకుములేక తీఱునా శివపూజ
కాళికాంబ! హంస! కాళికాంబ!

---

1. తుట్టుగొట్టువాడు = తొందరపడువాడు

555. పుష్యమాసమందు పొగవచ్చు నీటిలో
విధము బాగుగాను వెదకి కనుడి
మంటిలోపల పొగ మహి మేమొ గనరయా
కాళికాంబ! హంస! కాళికాంబ!

556. అగ్ని, నీరు, వాయు, వాకాశసారముల్
భూమికి కింత గలుగ పుట్టె పొగలు
పొగలు, మంటలెల్ల భూగర్భమున నుండు
కాళికాంబ! హంస! కాళికాంబ!

557. అగ్గి స్తంభ నమ్ము లదిమాకు దెలియును
జలము స్తంభమన్న సలుపగలము
అగ్నిజలముకట్టు టానందగురుడయా!
కాళికాంబ! హంస! కాళికాంబ!

558. విశ్వదోషములను వివరించి ప్రజలకు
బోధ చేసి మెప్పు పొందవలయు
విశ్వగురు డెవండొ వేదాంతి యత డౌను
కాళికాంబ! హంస! కాళికాంబ!

559. విశ్వకర్మ నేను విప్రులు మీరయా
[1]రొప్పి యెక్కువనుట రోతగాదె
ఎక్కువతక్కువలకు నెవరయా కర్తలు
కాళికాంబ! హంస! కాళికాంబ!

560. యముడు, ధర్మరాజు నమరిన చోటంటె
మనమనస్సులోనె యునికి గలదు
సత్తు ధర్మరాజు, చిత్తు యముం డౌను
కాళికాంబ! హంస! కాళికాంబ!

---

1. రొప్పి = బాధించి

561. ఈశు జూచికూడ నిది [1]నిబద్దన లేరు
వాసిలేని యొడలు పాసిపోయె
మోసపోయి నరులు మూర్ఖులై పోయిరి
కాళికాంబ! హంస! కాళికాంబ!

562. స్త్రీలచిన్నె చూచి చిత్తంబు పొర్లక
కత్తి కట్టువాడు బత్తిపరుడు
ఉత్తమో త్తముండు కత్తిగట్టును సుమా
కాళికాంబ! హంస! కాళికాంబ!

563. చక్కనమ్మవారు సకలవిశ్వం బంత
మోక్షమమ్మవారు ముక్తికాంత
పుట్టుగిట్టుటలకు భూదేవతే సాక్షి
కాళికాంబ! హంస! కాళికాంబ!

564. ఇపుడు సాక్షి మీకు విపరీతకాలమ్ము
జీవకోటి చావు చెప్పనేల?
చావుపుట్టుకలకు సాక్షి భూదేవత
కాళికాంబ! హంస! కాళికాంబ!

565. నాకు ది క్కెవండు? నడినాళమందున్న
వేగుచుక్కవంటి వెలుగు దిక్కు;
వెలుగుకన్న దిక్కు వెదకిన లేదయా
కాళికాంబ! హంస! కాళికాంబ!

566. జ్ఞానికాక అంకు చంపగా నేరడు
కానలేనివాడు తానె పోయి
అంకులాడిగాని [2]రాపు జ్ఞానెఋగడో
కాళికాంబ! హంస! కాళికాంబ!

---

1. నిబద్ధి = నిజము
2. రాపు = నింద

567. అజ్ఞు డింతగాక యధికుండు నెట్లాయె
మగతనమ్ము తరిచి మరులుకొనెను
మరులుకొనుచు జ్ఞానమహిమలు గనెనయా
కాళికాంబ! హంస! కాళికాంబ!

568. స్వచ్ఛమైన ద్విజుడు సత్తుచి త్తెఱుగును
ధర్మమార్గములను త్రచ్ఛవలెను
త్రచ్ఛలేడు గనుక తా నెట్లు బాపడౌ
కాళికాంబ! హంస! కాళికాంబ!

569. ఇహము పరము లేని దేమి బ్రాహ్మణ్యంబు
మున్ను గురుతులేని ముచ్చుగాక?
శుద్ధగురుడు నిలుచు చోటును గనవలె
కాళికాంబ! హంస! కాళికాంబ!

570. సకలజీవు లాత్మ – సరసుండు బ్రహ్మంబు
సకలజీవులకును సఖుడు గురుడు
సకలరక్షకుండు సంపూర్ణబ్రహ్మంబు
కాళికాంబ! హంస! కాళికాంబ!

571. జీవులను వధించి జీవికి వేసెనా
జీవదోషములను చిక్కువడును;
జీవహింసచేత చిక్కునా మోక్షంబు?
కాళికాంబ! హంస! కాళికాంబ!

572. బాప లెపుడు కాపువారి పే రనబోరు
పేరు పెంపు లేక విప్రు డగునె?
పెదవు లాడినంత విప్రుండు గాబోడు
కాళికాంబ! హంస! కాళికాంబ!

573. విడువ ముడువ గల్గి విభవంబు బహుగల్గి
[1]వివరణములు గల్గి విద్యగల్గి
అవునొ కాదొయన్న హరిదాసుదే తప్పు
కాళికాంబ! హంస! కాళికాంబ!

574. వచ్చిపోవునట్టి ముచ్చు [2]బిత్తలి యని
[3]తెరల బిత్త లైన తెలియలేరు
ఉన్నదినములందె నుపకారి గావలె
కాళికాంబ! హంస! కాళికాంబ!

575. వాదభేద ముడిగి పర మొక్కటే యని
పలుకు జనుల కెల్ల బ్రహ్మసాక్షి
శత్రుమిత్రులకును శంకరుం డొక్కడే
కాళికాంబ! హంస! కాళికాంబ!

576. శత్రు డెవడు చూడ మిత్రు డెవ్వాడగు
పాత్రు డెవడు తరిచి పైకి జూడు
నేర్పు సుంత గలిగెనేని బ్రహ్మంబుండు
కాళికాంబ! హంస! కాళికాంబ!

577. మేకలెల్ల గూడి యాకు మేసెడి తావు
తోకచాలు పిల్లమేక వచ్చు
అట్టితీరు భక్తు లాహరి వెనకుంద్రు
కాళికాంబ! హంస! కాళికాంబ!

578. ఒల్లు పెల్లుగాల్చు కల్లగురుండైన
ఉల్లమందు కుళ్ళు నెల్ల గాల్చి
కొల్లలాడు ముక్తి చల్లని గురుడైన
కాళికాంబ! హంస! కాళికాంబ!

---

1. వివరణములు = వ్యాఖ్యానములు 2. బిత్తలి = దిసమొలవాడు
3. తెరల బిత్తలి = గుడ్డలుండి లేనట్లుండు దిగంబరి

579. అస్తి, భాతి, ప్రియము లా బ్రహ్మరూపమ్ము
గా-గ్రహించె యోగిగణము మున్ను
రూప, నామములును లోకమ్ము పాలాయె
కాళికాంబ! హంస! కాళికాంబ!

580. పైన ముద్రలైన [1]భగము మీదను లేవె
ముద్రలన్న నింత మురిప మేల?
బుద్ధి భద్రమైన ముద్రల కర్మేల?
కాళికాంబ! హంస! కాళికాంబ!

581. రావణునకునెపుడు రాముడు సరిగాడు
రావణునకు మిగుల అంకు వచ్చె
సీత [2]నటిమిపట్ట చేటు లంకకు వచ్చె
కాళికాంబ! హంస! కాళికాంబ!

582. అంటు ముట్టు దోష మంత చేటాయెనే
అంటుదోష మున్న దనుట తప్పు
కర్మయోనులందు గలిగిరి నరులెల్ల
కాళికాంబ! హంస! కాళికాంబ!

583. నోటిపంటితీట గాట మింద్రియ మాయె
నోటిపంటిదురద నొవ్వుగూర్చె
నోటిదురద బట్టి నోటనే నమలాలి
కాళికాంబ! హంస! కాళికాంబ!

---

581. అస్తిభాతి ప్రియం రూపం, నామ చే త్యంశపంచకం
ఆద్యత్రయం బ్రహ్మరూపం జగద్రూపం తతోద్వయమ్
(శుకరహస్యోపనిషత్)

1. భగము = వైరాగ్యము, జ్ఞానము, మోక్షము
2. అటిమి = ఆక్రమించి, అటుము ధాతువు

584. నోట నమలునేర్పు నోమిన ఫలమేమి?
నమలు నేర్పులేక నయము లేదు
నేర్పు గలుగునరులు నెఱజాణ లైరయా!
కాళికాంబ! హంస! కాళికాంబ!

585. ఆకసమ్ముపైన అంత శూన్యమ్మని
పలుకు నరులకెల్ల బ్రహ్మ సాక్షి
పిండ మండమైన పృథివి బ్రహ్మాండమౌ
కాళికాంబ! హంస! కాళికాంబ!

586. నేల, నీరు, నిప్పు, గాలి యాకాశముల్
పుట్టి దేహములుగ పొలుపుగాంచె
అయిదు గురుతెఱుంగు మయుడు బ్రహ్మంబురా
కాళికాంబ! హంస! కాళికాంబ!

587. భువియు, నీరు, నిప్పు, పవన, మాకాశమ్ము
లెట్లు వచ్చినదియు నెఱుగ లేరు
బెండురీతి వచ్చి నిండె బ్రహ్మాండంబు
కాళికాంబ! హంస! కాళికాంబ!

588. ముచ్చటగను బుద్ధి మొత్తితేనే కాని
సొచ్చెమైన చోటు చూడలేరు
పిచ్చికుక్క గనుక వేటాడబోవునా
కాళికాంబ! హంస! కాళికాంబ!

589. బుద్ధి యేమిచేయు బుద్ధిగదులు వెన్క
మకరమనెడి [1]బిరట మర్లగొట్టు
బిరటయేమిచేయు [2]పిలిపిలి వచ్చిన
కాళికాంబ! హంస! కాళికాంబ!

---

1. బిరట = రూపాంతరము, బిరడ = మూత
2. పిలిపిలి = ముద్దుముద్దుగా, చిన్నచిన్నగా

590. పిలిపిలిగను వచ్చి పలువకు లోనాయె
నిలునిలుమ బిరట నిండ గొట్టు
మకరమనెడి బిరట మర్లగొట్టితె రాదు
కాళికాంబ! హంస! కాళికాంబ!

591. సుకము, దుఃఖములను ముకుళితహస్తులై
[1]ఏష్య మెఱిగి తిరుగు శిష్యులెల్ల
నొకనెల నొకగడియ నో!గురుడా! యంద్రు
కాళికాంబ! హంస! కాళికాంబ!

592. సెల వొసంగు టెట్టు లిల దేవుడైనాడు
సుకృతకర్మతోడ జూచె నన్ను
అజ్ఞతయును దీఱె నలజడులును మాఱె
కాళికాంబ! హంస! కాళికాంబ!

593. ఆకసమ్మునందు నత డున్న వాడని
ఘనులు వెదకివెదకి కానరైరి
పసిడి దానమిచ్చి పరికింప గోరిరి
కాళికాంబ! హంస! కాళికాంబ!

594. [2]సోపనమ్ములెక్కి శోధించి గుఱిగని
శివుడు నిలుచు [3]మఱుగు చిక్కె ననుచు
పైడి వలనువేసి పట్టిరి ఘనులయా!
కాళికాంబ! హంస! కాళికాంబ!

595. నీరు త్రాగునట్టి నేర్పు నెఱింగిన
అప్పు, పృథివి, తేజ మన్ని తెలిపె
మంచినీరుత్రాగు మహిమలు గనలేరు
కాళికాంబ! హంస! కాళికాంబ!

---

1. ఏష్యము = భవిష్యత్కాలము 2. సోపనమ్ములు = సోపానములు, మెట్లు
3. మఱుగు = రహస్యస్థలము

596. నంగనాచిచేప నమ్మినట్లనె యుండి
దొమ్మరి లగువేసి తొలగిపోయె
వేటగాడు దాని వెడలిపో నీయడు
కాళికాంబ! హంస! కాళికాంబ!

597. ప్రకృతిముఖమునందు బలిమి యుక్కుంజీర
తొడిగి వేయువాడు దొడ్డవాడు
గర్భమందు దొడిగి కడవేసి నాడయా
కాళికాంబ! హంస! కాళికాంబ!

598. మాయకాపురమున మర్మం బెఱుంగక
మరులుచేత పొర్లి మహిమ చూపె
కాయమందు నున్నమాయను గనరయా
కాళికాంబ! హంస! కాళికాంబ!

599. ఇన్నితెరువులేమి యీశుని గానక?
కర్ణమే శివుడని కానవలద?
మన్ను దినెడి తేలు మరియాద యెఱుగునా?
కాళికాంబ! హంస! కాళికాంబ!

600. నాదబిందువులను నటియించు విశ్వంబు
బిందుబీజమందు పృథివి పొరలె
పొరల రెంటిలోన పోబడి గనరయా
కాళికాంబ! హంస! కాళికాంబ!

601. తనువు తంతిబుట్ట, తంత్రులె వాయువుల్
తులువులు శ్రుతిచేయ తెలియ లేరు
ప్రణవము [1]మొఱయించి బ్రహ్మంబు గనిరయా
కాళికాంబ! హంస! కాళికాంబ!

---

1. మొఱయించి = మ్రోగించి

602. ఆలుమగల నెడముగా లాగు గురుడయా
వీని నాణ్య మెఱుగ బూని చూడ
గురుడు మొదటిసాదు కులమెల్ల తుదిసాదు
కాళికాంబ! హంస! కాళికాంబ!

603. కాళికాళియంచు కలవరపడనేల
కాళి లోకమాయ కన్నుమూయ
కాళి పైడిబొమ్మ కళలతో వెలుగురా
కాళికాంబ! హంస! కాళికాంబ!

604. కాళికాళియంచు కలత నందెద రేల
కాళిగాక జన్మ [1]ఖాయ మగునె
కాళిచెంత నున్న కష్టంబు లేదురా
కాళికాంబ! హంస! కాళికాంబ!

605. నాసికాగ్రమందు నాణెమౌ చురకత్తి
[2]ఏస సుంతలేక చేసెనేని
కోసి పాఱవైచు కోయన భూతాల
కాళికాంబ! హంస! కాళికాంబ!

606. ముండమోపికైన చాండాలికైనను
ఎగ్గులేక చేతు లెత్తవలెను
ఎగ్గుసిగ్గులేక యెఱగాలి మర్మంబు
కాళికాంబ! హంస! కాళికాంబ!

607. రాళ్ళుమొదలు క్రియలు రాకడ, పోకడ,
నింద, స్తుతియులేని నిలువు రాళ్ళు
అష్టమతములకును నధికుండు విశ్వుండు
కాళికాంబ! హంస! కాళికాంబ!

---

1. ఖాయము = స్థిరము (వాడుక, విశేష్యము)
2. ఏస = వంకర

608. అదియ శిష్యపథ మహంకార మదియేమి?
లేదులేదు గురుడ! లేత ముదురు
పూవు వాసనలకు పోబడి యున్నదా!
కాళికాంబ! హంస! కాళికాంబ!

609. మంత్ర యంత్ర, తంత్ర మహిమలు తానైన
గురుడె యాయుధంబు గురువులకును
గురునియాయుధంబు గురుశిష్యులకు గుర్తు
కాళికాంబ! హంస! కాళికాంబ!

610. చదువచదువ బుట్టు చదువున రుచిపుట్టు
మలచి చదువనొక్క తలపు పుట్టు
తలపుపుట్టు చదువు తలప తానేనయా
కాళికాంబ! హంస! కాళికాంబ!

611. అన్ని యేకమైన నన్వయ మేమాయె
కన్నవిన్నవారు కనరె ఘనులు
నిన్నమొన్నవారి కెన్నగా తరమౌనె
కాళికాంబ! హంస! కాళికాంబ!

612. రూపరహితునకును రూపమ్ము గల్పించి
కర్మకాండ పెంచి కలుషమతులు
ధర్మమార్గములను ధ్వంసమ్ము చేసిరి
కాళికాంబ! హంస! కాళికాంబ!

613. నిర్విశేషమైన నిర్గుణబ్రహ్మమ్ము
సగుణముగను బోధసలిపి జనుల
జడుల జేసినారు మిడిమిడి జ్ఞానులు
కాళికాంబ! హంస! కాళికాంబ!

614. కోతిపల్లరీతి గురువుతో నుండిన
శిష్యులకును సుంత చేటురాదు
నమ్మినముకున్న దుమ్ము పాలగుదురు
కాళికాంబ! హంస! కాళికాంబ!

615. సర్వధర్మములను సద్గురు పాదాల
చెంత నుంచి కర్మచింత డించి
సంచితము దహించి సకలమ్ము తానౌను
కాళికాంబ! హంస! కాళికాంబ!

616. తనువు ముడుతపడిన తల తెల్లవాఱిన
చెవులు, కనులు, ముక్కు చేవచెడిన
ఆత్మలోన ఆశ హద్దుపద్దులు మీఱు
కాళికాంబ! హంస! కాళికాంబ!

617. భోగ మనుభవింప రోగాల భయమబ్బు;
వాదభయము శాస్త్రవాదమునను
భయములేని దొక్క వైరాగ్యభాగ్యమే
కాళికాంబ! హంస! కాళికాంబ!

618. యోగ మభ్యసించి యోగీశ్వరులు – నాల్గు
యోగములను ముక్తి నొందవలయు
అఱుమెట్టు లెక్క అంబ దర్శనమిచ్చు
కాళికాంబ! హంస! కాళికాంబ!

619. అటమటించు జనుల కానందభోగాలు
వచ్చుగాక నీతి హెచ్చుగాక
కలసిమెలసి బ్రతుకు కాల మేతెంచును
కాళికాంబ! హంస! కాళికాంబ!

620. అజ్ఞతకును మూల మశరీర సశరీర
ములుగ బ్రహ్మసూత్రములను దెలిసె
కలను గన్నవస్తు విలలోన లేనట్లు
కాళికాంబ! హంస! కాళికాంబ!

621. నాల్గుజాతులకును నాగేటి మొనలోన
ప్రాణమున్న దంచు బలికినారు
ఇలను దున్నువారు బలభద్రు లగుదురు
కాళికాంబ! హంస! కాళికాంబ!

622. మఱుగుపడినయాత్మ మాయికమా! ఇది
సత్యమా యటంచు జంకరాదు
మఱుగుతొలగ మాయ మాయమౌ ఆత్మకు
కాళికాంబ! హంస! కాళికాంబ!

623. స్వాములనగ ఐహికాముష్మిక ఫలాల
వాంఛ చేయనట్టివారు ధరణి
లోకవాంఛలకును లోబడ గురుడౌనె?
కాళికాంబ! హంస! కాళికాంబ!

624. దివ్యదీప్తితోడ దేహాభిమానమ్ము
లేనివారు పుడమి లేనివారు
పుడమి లేనివారు పుణ్యాత్ము లవుదురు
కాళికాంబ! హంస! కాళికాంబ!

625. ఆత్మసత్తకంటె నన్యమ్ముగా సత్త
లేనెలేదు చూడ కానరాదు
కానవచ్చుజగము కల్పనమ్మగు మాయ
కాళికాంబ! హంస! కాళికాంబ!

626. కల, సుషుప్తి మాయికములని గుర్తించి
మేలు కట్టిదంచు లీల నెఱిగి
భ్రాంతు లుడుగువారు పరతత్వవిదులైరి
కాళికాంబ! హంస! కాళికాంబ!

627. పంచకోశములకు పరమైన బ్రహ్మమ్ము
నేనెకాని మేను కానెకాదు
అంచు దలచువార లంబ! నీభక్తులు
కాళికాంబ! హంస! కాళికాంబ!

628. మానసమ్మునందు జ్ఞానవైరాగ్యాలు
కుదురుపడగ ఆశ బెదరి పోవు
ఆశపోవ నంతమొందును దుఃఖమ్ము
కాళికాంబ! హంస! కాళికాంబ!

629. తృప్తిలేనివాడు దేహిదేహి యటంచు
కన్నకన్నవారి కాళ్ళు పట్టు
కాళ్ళు పట్టినంత కడుపు నిండగబోదు
కాళికాంబ! హంస! కాళికాంబ!

630. కర్మవాది స్వర్గగమనమ్ము చేయును
బ్రహ్మవాది మోక్షపథము చేరు
జన్మ రహితమగును శాస్త్రార్థములు వీడ
కాళికాంబ! హంస! కాళికాంబ!

631. మనసుపెట్టి శ్రవణ మననాదుల నెఱింగి
నియతిగలిగి జ్ఞాన నిష్ఠ మెలగి
కర్మసంచయముల గాల్చును గురుమూర్తి
కాళికాంబ! హంస! కాళికాంబ!

632. దుష్టమైనదాని శిష్టమ్ముగా జేయ
నసువుపడును తొల్లిగుణము చెడును
దుష్టశిష్టములకు దూరమ్ము బ్రహ్మమ్ము
కాళికాంబ! హంస! కాళికాంబ!

633. పుణ్యపాపకర్మములవల్ల మనుజుల
దేహములు జనించి తీఱు తుదకు
పుట్టినట్టివెల్ల గిట్టుటే సాక్ష్యమ్ము
కాళికాంబ! హంస! కాళికాంబ!

634. చదువు ధనము తపము సౌందర్యమ్ము గుణమ్ము
కులము గోత్రములను గలుగు మదము
మానువారె దురభిమానవర్జితు లిల
కాళికాంబ! హంస! కాళికాంబ!

635. నీడరీతి బ్రహ్మనిష్ఠాగరిష్ఠుల
వీడకుండ బ్రహ్మవిద్య నెఱుగు
వాడె వీరగురుడు ప్రజ్ఞా ప్రపూర్ణుండు
కాళికాంబ! హంస! కాళికాంబ!

636. పరశరీరములను స్వశరీరమట్లుగా
తలచువాడు హింస సలుపబోడు
హింస సలుపనట్టి ఇంగితజ్ఞుడె బ్రహ్మ
కాళికాంబ! హంస! కాళికాంబ!

637. సగుణ బ్రహ్మమైన సద్గుణ దుర్గుణ
వర్గములను జెప్పవచ్చు కాని
నిర్గుణునకు గుణమునిల్ప శక్యమ్మౌనె
కాళికాంబ! హంస! కాళికాంబ!

638. బ్రహ్మమెపుడు పుణ్యపాప రాహిత్యమై
మాయవలన చేర్పు మార్పు గనక
నిష్కళంకమగుచు నిరవద్యమై యుండు
కాళికాంబ! హంస! కాళికాంబ!

639. బ్రహ్మచింతనమున బరగిన చిత్తమ్ము
ఆటుపోటులేక అణగిమణగి
నిర్మలముగ నిలిచి నియమమ్ము పాటించు
కాళికాంబ! హంస! కాళికాంబ!

640. చరణములను వ్రాలి శరణన్న వారికై
సుకృతఫలములెల్ల చూరలిచ్చు
గురుని మించువారు ధరలోన లేరయా
కాళికాంబ! హంస! కాళికాంబ!

641. వేదవిదుడు గాఢవిషయ విరక్తిచే
దేహబంధములను ద్రెంచగలడు
దేహబంధములను ద్రెంచ దేవుండౌను
కాళికాంబ! హంస! కాళికాంబ!

642. ప్రకృతివలన గలుగు బ్రహ్మాండభాండాలు
పుట్టి చచ్చు నీటిబుడగలట్లు
కలతలేకనిలుచు నిల విరాడ్రూపమ్ము
కాళికాంబ! హంస! కాళికాంబ!

643. అచలుడగుచు నిత్య మానందరూపుడై
సతుల సుతుల ముక్తసంగు డగుచు
శాంతుడైన గురుని చరణసన్నిధి యేలు
కాళికాంబ! హంస! కాళికాంబ!

644. పుణ్యలోకములకు బోయిన పోకగా
పోవువారు వచ్చి పోవుచుంద్రు
వచ్చిపోవుదారి వదలించుకొనవలె
కాళికాంబ! హంస! కాళికాంబ!

645. కర్మమునకు స్వర్గగమనమ్ము ఫలమగు
జ్ఞానమునకు మోక్ష మౌను ఫలము
జ్ఞానకర్మములకు సరిపొత్తు కుదురదు
కాళికాంబ! హంస! కాళికాంబ!

646. నిత్యసత్యమయ్యు నిర్వికారమ్మయ్యు
నిర్ణయింపరాని పూర్ణమయ్యు
నిండియుండువెలుగు పండువెన్నెల సుమా!
కాళికాంబ! హంస! కాళికాంబ!

647. స్వాత్మశక్తి కర్మసన్యాస యోగమ్ము
నభ్యసింపవలయు యతివరుండు
ముక్తసంగుడైన మోక్షమ్ము సిద్ధించు
కాళికాంబ! హంస! కాళికాంబ!

648. ఉపనిషత్తులందు నుపదేశికులయందు
శ్రుతులయందు శ్రద్ధ చూపవలయు
శ్రద్ధలేక ముక్తి సాధింప శక్యమా?
కాళికాంబ! హంస! కాళికాంబ!

---

645. "ద్వయోఃపరస్పరాపేక్షా విద్యతే న కదాచన."
శంకర భగవత్పాదుల – సర్వవేదాంత సిద్ధాంతసార సంగ్రహము.

649. జాడ్య దుఃఖములు నసత్తయు మూడును
మాయలక్షణములు మది దలంప
మాయ వదలిపోవ మనుజుడే యజుడౌను
కాళికాంబ! హంస! కాళికాంబ!

650. అస్థిరము శరీర; మందున్న అశరీరి
యైన దాత్మ–నిత్యమనియె శ్రుతులు
ఆత్మతత్వ మెఱుగ నంతట తానుండు
కాళికాంబ! హంస! కాళికాంబ!

651. అఖిలజనులు శాశ్వతానంద మందగా
దుఃఖజాలములను తొలగద్రోయ
కోరుకొనుట సాజమౌరీతి జగతిలో
కాళికాంబ! హంస! కాళికాంబ!

652. వాదభేద ముడిగి వేదాంత విజ్ఞాన
నిశ్చితార్థులైన నియమపరులు
బ్రహ్మతోడ ముక్తిభావన గందురు
కాళికాంబ! హంస! కాళికాంబ!

653. అంతరింద్రియముల నవలోకనము చేయ
చాలువాడు – వాని నేలువాడు
నేనుమేను లెఱిగి నిత్యుడై విలసిల్లు
కాళికాంబ! హంస! కాళికాంబ!

654. గురుడుచూపు గురుతు పరికించినంతనే
గబ్బుగీమువంటి మబ్బుతొలగు
మబ్బుతొలగ నరుడు మహనీయు డైపోవు
కాళికాంబ! హంస! కాళికాంబ!

---

649. అసత్తాజాడ్యదుఃఖేద్వే మాయారూపత్రయం త్విదమ్.
(వేదాంతపంచదశి – 15– – ప్రకరణం, 23 శ్లో.)

655. బోధ చేయువాడు బోధింపబడువాడు
లోకవాసనలకు లొంగిపోక
నిలిచియుందురేని నిర్గుణబ్రహ్మలు
కాళికాంబ! హంస! కాళికాంబ!

656. బ్రహ్మ విద్య గురునివల సంప్రాప్తించు
నన్యులకును దెలుప నలవిగాదు
ముక్తి గోరునట్టి భక్తుల కిది దారి
కాళికాంబ! హంస! కాళికాంబ!

657. పుస్తకములు చదువ పూర్ణత్వ మబ్బదు
హృదయసంపుటముల చదువవలయు
పారిశుద్ధ్య మొకటె పరమాత్మ చేర్చును
కాళికాంబ! హంస! కాళికాంబ!

658. తిలలరసము లేక దీపమ్ము వెలుగదు
పూవులేక ఫలము పుట్టబోదు
భక్తిలేక జ్ఞానఫలము లభింపదు
కాళికాంబ! హంస! కాళికాంబ!

659. సుందరులను జూచి సుఖభోగముల జూచి
ధనము చూచి గొప్పదనము చూచి
కన్నుగుట్టనేని మన్నైను మనుజుండు
కాళికాంబ! హంస! కాళికాంబ!

660. అన్నమయములైన వన్ని జీవమ్ములు
కూడులేక జీవకోటి లేదు
కూడు దినెడికాడ కులభేద మేలొకో
కాళికాంబ! హంస! కాళికాంబ!

661. స్వానుభవము లేని వారి సల్లాపాలు
చిలుకపలుకులట్లు తలపవలయు
వినుటవఱకె యనుభవింప నర్హము కావు
కాళికాంబ! హంస! కాళికాంబ!

662. పరమగురునివలన వైరాగ్య భాగ్యమ్ము
కలుగకున్న ముక్తి కలుగబోదు
ముక్తి నీనిబోధ యుక్తియుక్తము కాదు
కాళికాంబ! హంస! కాళికాంబ!

663. పలుక నేర్చినంత బ్రహ్మానుభవమును
పొందలేరు ముక్తి నందలేరు
త్యాగధనుడుగాని యోగి కానేరడు
కాళికాంబ! హంస! కాళికాంబ!

664. గురునిబోధ వినక కోటి జన్మము లెత్తి
ఎంతచదువ తత్వ మెఱుకపడదు
బ్రహ్మవిద్య మిగుల భారమౌ దూరమౌ
కాళికాంబ! హంస! కాళికాంబ!

665. ఆత్మనిష్ఠతో నిరాలంబమును జెంది
సావలంబ మానసమును విడిచి
సంచరింప కర్మసన్యాసి యతడౌను
కాళికాంబ! హంస! కాళికాంబ!

---

665. నిరాలంబం సమాశ్రిత్య
సాలంబం విజహాతి యః
స సంన్యాసీ చ యోగీ చ
కైవల్యం పద మశ్నుతే. (నిరాలంబోపనిషత్)

666. అల్పసుఖము నిచ్చి యత్యంత దుఃఖమ్ము
కలుగజేయు కామ్య కాంక్ష లెల్ల
నిత్యసుఖము బ్రహ్మనిష్ఠ మాత్రము కూర్చు
కాళికాంబ! హంస! కాళికాంబ!

667. ఆత్మతత్త్వవేత్త లాదర్శవంతులై
నడువవలయు వాంఛ విడువవలయు
చూపరులకు నడత చూపుట మేలౌను
కాళికాంబ! హంస! కాళికాంబ!

668. పెద్దవారిజూచి పిన్నలు నడతురు;
పెద్దవారు తత్త్వవిదుల గాంచి
మేలుకీళ్ళ నెఱిగి మెలగ వాంఛింతురు;
కాళికాంబ! హంస! కాళికాంబ!

669. చదివిచదివి ధర్మశాస్త్రంబు లన్నియు
బ్రహ్మ మెఱుగనట్టి పామరుండు
కూరలోని తెడ్డు తీరైనవాడౌను
కాళికాంబ! హంస! కాళికాంబ!

670. అమృతరసము త్రావునతడు కోరడు నీళ్ళు;
పరమమైన బ్రహ్మ మెఱుగువాడు
వేదశాస్త్రములను వీక్షింపగాబోడు
కాళికాంబ! హంస! కాళికాంబ!

671. మానవుల యొడళ్ళు మాయామలమ్ముతో
నిండియుండు, సుకృత మెండి యుండు
దేహశుద్ధిపిదప దేహి తా శుద్ధియౌ;
కాళికాంబ! హంస! కాళికాంబ!

672. భక్తులైనవారు పరిపక్వబుద్ధిచే
ధ్యానమందు నాత్మ నందగలరు
ఆత్మ నంద శాశ్వతానంద సుఖ మబ్బు
కాళికాంబ! హంస! కాళికాంబ!

673. బ్రహ్మభావ మచలభావమ్ముగా నెంచి
నిర్గుణముగ బ్రహ్మనిష్ఠ నెంచి
మును తరించినారు ఘనులౌ మునీశ్వరుల్
కాళికాంబ! హంస! కాళికాంబ!

674. మాయ గప్పుచుండు మాటిమాటికి దాని
తేటపడ గురూపదేశమునకు
మరలగొట్టువాడు మఱుజన్మకును రాడు
కాళికాంబ! హంస! కాళికాంబ!

675. గుండెగూటిలోన గూర్చున్న యాత్మను
సర్వసాక్షియైన సత్తటంచు
బ్రహ్మవిదులు విషయవాసనల్ విడిచిరి
కాళికాంబ! హంస! కాళికాంబ!

676. వేనవేలు శిష్యవిత్తాపహారకుల్
కలరు గురులు భరతఖండమందు;
ఎంచ లేరు శిష్యహృత్తాపహారకుల్;
కాళికాంబ! హంస! కాళికాంబ!

677. వెలదులకును వేదవిద్యాధికారమ్ము
లేదటంచు బ్రహ్మలిఖిత మంచు
నోరుతెఱచి మఱచినారు వాణిని నిన్ను
కాళికాంబ! హంస! కాళికాంబ!

---

674. ఆవృత్తి రసకృ దుపదేశాత్. (బ్రహ్మసూత్రములు)

678. ఆకళింప నతిథు లభ్యాగతుల కెల్ల
రాజయోగ మొకటె రక్షచేయు
ఆశ్రమములలో గృహస్థాశ్రమమె మేలు
కాళికాంబ! హంస! కాళికాంబ!

679. ముక్తికాంతతోడ ముచ్చట లాడగా
దలచువారు బంధములను ద్రెంచి
కొండశిఖరమందు గూర్చుండగావలె
కాళికాంబ! హంస! కాళికాంబ!

680. చిత్తసత్తులకును జీవుండు సాక్షియౌ
పరగ జీవులకును బ్రహ్మసాక్షి
అఖిలజీవులకును నంతరాత్మయె సాక్షి
కాళికాంబ! హంస! కాళికాంబ!

681. దుష్టభావనములు నష్టమై పోయిన
ధర్మమూర్తి హృదయతత్వ మెఱిగి
మెలగువారు నిన్ను దిలకింప నేర్తురు
కాళికాంబ! హంస! కాళికాంబ!

682. కుడిగ ముక్కునుండి నడచు పింగళనాడి
ఎడమముక్కునుండి నడచు నిడయు
అడుగునుండి వెన్నునంటి ప్రాకు సుషుమ్న
కాళికాంబ! హంస! కాళికాంబ!

683. మనసుకెన్న చందమామ అధిష్ఠాత
హెచ్చులొచ్చు లుద్భవించు కతన
చంద్రు దాల్చి శివుడు చంద్రమౌళియు నయ్యె
కాళికాంబ! హంస! కాళికాంబ!

684. ఉల్లిగడ్డలకును నుపదేశ మిచ్చెడి
కల్లగురువు లెల్లకడల దిరిగి
లొల్లెగాంౘ శిష్యులుగ జేసికొందురు
కాళికాంబ! హంస! కాళికాంబ!

685. 'బ్రహ్మమనగ నేమి' బ్రహ్మశబ్దార్థమ్ము
దేనిగుణమువలన దెలియవచ్చు?
నన్న ప్రశ్న ముదయమంద నీవౌదువు
కాళికాంబ! హంస! కాళికాంబ!

686. పరము తిరము గాని క్షర మక్షరము లంచు
బోధ చేయుచుండు బాధగురువు
తృష్ణ నెఱుగనట్టి భ్రష్ట బోధిదియౌను
కాళికాంబ! హంస! కాళికాంబ!

687. ఆర్తి తీఱుననుచు మూర్తమ్ము పెట్టిన
పెండ్లికూతు రపుడె ముండమోయు;
కంకణాలనాడె కాటి కేగె మగండు
కాళికాంబ! హంస! కాళికాంబ!

688. [1]దాయ మనగ గురుని దర్శనమేగదా!
గెలుచు టగన మాయ దెలిసికొనుట
మాయ దెలిసి మసలు మనుజు డీశుం డౌను
కాళికాంబ! హంస! కాళికాంబ!

689. బ్రతుకు మొలకలెత్తు పకృతిని దర్శింప
బ్రతుకు గతుకు లగు నిరాశపడిన
బ్రతుకు చివికిపోవు పరమాత్మ దర్శింప
కాళికాంబ! హంస! కాళికాంబ!

---

1. దాయము = పంచుకొనదగిన తండ్రిసొత్తు

690. ప్రకృతిబంధనమున బడియుండ నరకమ్ము
ప్రకృతినుండి వేఱుపడుటె ముక్తి
ప్రకృతి వికృతిలేని బయలె బ్రహ్మంబగు
కాళికాంబ! హంస! కాళికాంబ!

691. రూఢమైన స్వస్వరూపావధారణే
చీడపీడ లలము చిత్తమందు
మరులుకొన్న ఎండమావుల చల్లార్చు
కాళికాంబ! హంస! కాళికాంబ!

692. సుప్రసన్న వగుచు చూడ ముక్తి లభించు
అప్రసన్న వైన నలము మాయ
నిన్ను నమ్మి కొలువ నిర్మలత్వము గల్గు
కాళికాంబ! హంస! కాళికాంబ!

693. మతము మత్తుగూర్చు మార్గమ్ము కారాదు;
హితము గూర్పవలయు నెల్లరకును;
హితము గూర్పలేని మతము మానగవలె;
కాళికాంబ! హంస! కాళికాంబ!

694. గురులు శిష్యులెల్ల పరిపాలనాపరుల్
పారమార్థికులుగ ప్రబలిరేని
సంఘమందు సుఖము శాంతి వర్ధిల్లును
కాళికాంబ! హంస! కాళికాంబ!

695. సత్య, శీల, ధర్మ సంస్థాపనార్థమై
యుగయుగాల పుట్టు వొందు చంద్రు
సహజశక్తి గల్గు సంస్కారు లిలలోను
కాళికాంబ! హంస! కాళికాంబ!

696. గురుముఖాన విన్న కుండలినీశక్తి
మేలుకొలిపి యాఱుమెట్టు లెక్క
దూరదృష్టితోడ దూరశ్రవణ మబ్బు
కాళికాంబ! హంస! కాళికాంబ!

697. మాన్యమైన కందిమల్లయ్య పల్లెలో
స్థిరనివాస మేరుపఱుచు కొంటి;
కూడియుంటి సాధ్వి గోవిందమాంబతో;
కాళికాంబ! హంస! కాళికాంబ!

698. సకలజాతులకును సాధనమ్ములు గూర్చు
జాతివాడ, వేదనీతి యుతుడ
శిష్యగణముతోడ సేవింపబడువాడ
కాళికాంబ! హంస! కాళికాంబ!

699. కులమతాల జాడ్యములలోన దపియించు
దీనజనుల సేద దీర్చువాడ;
మానవుండె ధరను మాధవుం డనువాడు;
కాళికాంబ! హంస! కాళికాంబ!

700. నా[1]పద్య యెంతొ హృద్యము
నా[2]పద్యము నాకు నవ్వు నాణెము గూర్చున్
నా[3] పథ్యము స్థిరతరమౌ
నా పద్యము యుగయుగాల నడచును కాళీ!



1. పద్య = త్రోవ
2. పద్యము = ఛందోబద్ధమైన కావ్యము
3. పథ్యము = హితము



ఆచార్య పులికొండ సుబ్బాచారి, తెలంగాణా రాష్ట్రంలో ఖమ్మం జిల్లా, మధిర మండలం, మర్లపాడు గ్రామంలో 1956 జూలై 10న జన్మించారు. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలోని ఆంధ్రా విశ్వవిద్యాలయంలోని జానపదకళలు, గిరిజన అధ్యయన శాఖలో ఆచార్యులుగా పనిచేశారు. ఉస్మానియా విశ్వవిద్యాలయంలో 1983లో ఎం.ఎ. తెలుగు చదివి, "జానపద విజ్ఞానంలో రుంజలు ఒక పరిశీలన" (ఎం.ఫిల్.-1986) జానపద విజ్ఞానంలో ఆశ్రిత సాహిత్యం. (పి.హెచ్‌డి. 1992) అనే అంశాలమీద పరిశోధన చేశారు. జానపద విజ్ఞానరంగంలో సుబ్బాచారి గారు విశేషమైన కృషిచేశారు. అనేక సంస్థలలో బాధ్యతలు నిర్వహించారు. ఆయన కృషి గుర్తింపుగా అనేక పురస్కారాలు అందుకున్నారు. రామరాజు జానపద విజ్ఞాన బహుమతి వాటిలో ఒకటి. సుబ్బాచారి గారు నిరంతర పరిశోధనలు ఇప్పటికే ఇరవైకి పైగా పరిశోధన, విమర్శగ్రంథాలు ప్రచురించారు. ఆయన కవి కూడా. "బాడిసె మొక్కబోయింది" - అనే కావ్యం ప్రచురించారు. పోతులూరి వీరబ్రహ్మంగారి మీద మౌలికమైన పరిశోధన గ్రంథం రచించారు.

ప్రజాశక్తి బుక్‌హౌస్

సామాజిక తత్త్వవేత్త
పోతులూరి వీరబ్రహ్మం
సాహిత్య, సాంస్కృతిక సమ్మేళనం

కర్నూలు • 12.10.2019